# విషాద తిమ్మరుసు నాటకము

To
Sri M. Rama Rami Reddy
Proprietor, Mandakini Press
Nellore.
with the best compliments
of the Author
[illegible]
26 [illegible]

'నాట్య కవితా కళానిధి'


విద్వాన్ దర్భా వేంకటకృష్ణమూర్తి, ఎం. ఏ.

ఆంధ్రశాఖాధ్యక్షుఁడు

వేంకటగిరి రాజ కళాశాల

నెల్లూరు



1956





[వెల రెండు రూపాయలు

# అంకితము

సీ. అల్ల పాలావజ్ఝలాన్వయంబున నొక్క
యతి వరంబున నెవం డవతరించెఁ,
బాండితీగరిమ నుద్దండుఁడౌ నాగేశు
సన్నిధిం దరిచె శాస్త్రంబు లెవఁడు,
బావ గంగాధరున్ సేవించి యేవాఁడు
నేరిచెన్ వేదాంతసార మెల్ల,
వాణి యెవ్వాని జిహ్వనె నిల్చి పలికించె
సంస్కృతాంధ్రాఖండసరసకవిత,
ఏవాని యాంగ్లభాషావైదుషిం గాంచి
తెల్లఁబోయిరి యల్ల తెల్లదొరలె,
ఏవాని మేధాప్రభావ మీక్షించి ధీ
మంతు లెందఱో పదాక్రాంతు లైరి,
గంగాప్రవాహంబుగాఁ దత్త్వ మనిశంబు
బోధించె యతులు నుప్పొంగ నెవఁడు,
వైద్యంబునం దంతవాఁడు లేనేలేఁ డ
టంచు విఖ్యాతి నార్జించె నెవఁడు,

తే. ఆతఁ డప్రతిమప్రతిభాభినుతుఁడు
భోగయోగాన్వితుఁడు నాగభూషణుండు
సారసారస్వతోపదేశకుఁడు నాదు
మేనమామకు నిది కృతిగా నొనర్తు.

# తొలిపలుకు

ఆదినుండియు నాకు మోదాంతనాటకములను రచించుటయందును, అందు నటించుటయందును అభిరుచి మెండు. 1939 సం॥ వఱకు నట్లే జరిగెను. కొందఱు మిత్త్రుల ప్రోత్సాహమున 1939 సం॥లో "అనార్కలి" అను ఖేదాంతనాటకమును రచించి ప్రదర్శించినపుడు పెద్ద లగు ప్రేక్షకులు మిక్కిలి ప్రశంసించిరి.

నాట్యకళాకోవిదులు కార్వేటిసంస్థానాధిపతులు నగు శ్రీ శ్రీ శ్రీ కుమార స్వామిరాజావారి యాహ్వానముపై వారి సంస్థానమందలి నాటకశాలయందు 1942 సం॥ జూన్ నెలలో మా "శ్రీకృష్ణనాట్యకళామండలి" తో మద్రచిత మోదాంతనాటకములతోపాటు "అనార్కలి" ని బ్రదర్శించినపుడు శ్రీ రాజా వారును ఈ ఖేదాంతనాటకమునే యతిమాత్రముగా నభినందించిరి, మోదాంత ముగా నా రచియించిన యప్పటి "శ్రీకృష్ణరాయవిజయము" ను ఈ "విషాద తిమ్మరుసు"గా రూపొందించుటకు నన్నుఁ బ్రేరేఁచినది శ్రీరాజావారి నాఁటిప్రశంసయే.

1942 సం॥ జూన్ మాసాంతముననే యీ నాటకమును రచించియుఁ, దత్పూర్వరచితనాటకములకుం బోలె దీనికిని ముద్రణావకాశము లభింపమింజేసి నాలుగు వత్సరము లూరకుండి, 1946 సం॥లో దీని నెట్లో ప్రకటింపఁ గలిగితిని. నాఁటినుండియు ఈ నాటకము అయానాటకసంఘములవారిచేఁ బలుతావులఁ బ్రదర్శింపఁబడి ప్రజల యాదరమునకుఁ బాత్ర మై, నేఁటికి ఆంధ్రవిశ్వకళాపరి షత్పాఠ్యగ్రంథనిర్ణాయకమండలివారి యామోదమున ద్వితీయముద్రణభాగ్యము నందఁ గలిగినది. ఇందుకు వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈ రెండవ కూర్పునందుఁ గొన్ని మార్పులును జేర్పులును గావింపఁబడినవి.

చారిత్రికమగు నిందలి యితివృత్తమున కాధారములు :—

(1) రాయల కొలువునందలి "నన్నిజ్" అను పోర్చుగీసుచరిత్రకారుని వ్రాఁతలు.

(2) కుమారధూర్జటి "శ్రీకృష్ణరాయవిజయము".

(3) శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారి "హిందూదేశకథాసంగ్రహము — మహమ్మదీయయుగము".

(4) శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారి "కవిజీవితములు".

(5) శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి "తిమ్మరుసు".

ఔచిత్యపోషణమునకై నాటకీయముగా నాచేయొనర్చిన కల్పన లిందుఁ గొన్ని గలవు. అందు ముఖ్యమైనవి :—

(1) రాయల కుమారుని పేరు "తిరుమలరాయలు" అన్నది "రంగ రాయలు"గా మార్చుట.

(2) రాయలు తన యాఱేండ్లకుమారునకే పట్టాభిషేకముఁ జేయ సంకల్పించుటకుఁ గారణములను గల్పించుట.

(3) రాయల కుమారుని మృతికిఁ గారకుఁడగు పాత్రను సృజించుట.

(4) అప్పాజియెడల రాయలకు అనుమాన మంకురించి బలపడుటకుఁ దగిన సంఘటనములను గల్పించుట.

(5) అప్పాజిపట్లఁ జూపిన యవినీతివలన రాయలకుఁ గళంకము గలుగ కుండఁ దగు సన్నివేశములను నిర్మించుట.

(6) గజపతికి రాయలకును వియ్యమును నెఱపి, శైవవైష్ణవమతసామ రస్యమును నెలకొల్పఁ జాలిన స్మార్తుని యద్వైతతత్త్వప్రభావమును బ్రకటించుట.

(7) నాయికానాయకుల యన్యోన్యానురాగమునకు రుక్మిణీ-కృష్ణుల యనురాగముతోడి సామ్యమును సూచించుట - మున్నగునవి.

అర్థవైశద్యమునకును, నటుల సౌకర్యమునకును అందందు గద్యపద్యము లలో విసంధి పాటించితిని.

పెక్కేండ్లుగా నాకుఁ గల నాటకరచనానటనానుభవములఁ బురస్కరించు కొని నేఁటి యాంధ్రరంగమున కనుకూలముగా నారచియించిన యీ నాటకము సహృదయులగు విమర్శకులయు, సమర్థులగు నటులయు ఆదరామోదములను బడయఁ గలుగు నని విశ్వసించుచున్నాను.

ఇట్లు
సుధీవిధేయుఁడు

నెల్లూరు
12 – 4 – 1956

దర్భా వేంకటకృష్ణమూర్తి.

## హెచ్చరిక

నా లిఖితపూర్వకమగు అనుమతి లేక యెవ్వరైనను ఈ నాటకమునందలి కథాకల్పన (Plot) గాని పద్యములు గాని గేయములు గాని గద్యముగాని తద్భాగ ములు గాని యుపయోగించుకొన్నను, టాకీ కిచ్చినను, గ్రామఫోనురికార్డుల కిచ్చినను, ఇతరభాషలలోనికి తర్జుమా చేసినను, నాటకమును బ్రదర్శించినను, చట్టము ప్రకారము చర్య తీసికొనఁబడును,

రచయిత.

# ఈ నాటకమునందలి పాత్రలు

| | | | |
|---|---|---|---|
| 1. | కృష్ణదేవరాయలు | ... | ఆంధ్రకర్ణాటాధీశ్వరుఁడు |
| 2. | తిమ్మరుసు | ... | రాయల ప్రధానమంత్రి |
| 3. | రంగరాయలు | ... | రాయల కుమారుఁడు |
| 4. | కామానాయకుఁడు | ... | రాయల రాయబారి |
| 5. | పేరిశాస్త్రి | ... | జోస్యుఁడు |
| 6. | రామావధానులు | ... | పండితుఁడు |
| 7. | భద్రుఁడు | ... | రాయల చారుఁడు |
| 8. | ప్రతాపరుద్రగజపతి | ... | ఉత్కలదేశాధీశ్వరుఁడు |
| 9. | వీరభద్రగజపతి | ... | ప్రతాపరుద్రుని కుమారుఁడు |
| 10. | ఈశ్వరభట్టు | ... | ప్రతాపరుద్రుని మంత్రి |
| 11. | మురహరుఁడు | ... | వీరభద్రుని అంతరంగమిత్త్రుఁడు |
| 12. | భటుఁడు | | |
| 13. | అన్నపూర్ణ | ... | ప్రతాపరుద్రుని పుత్రిక |
| 14. | మాధురి | ... | అన్నపూర్ణ ప్రాణసఖి |
| 15. | చండిక | ... | వీరభద్రుని దాసి |

శ్రీ శారదాగురుభ్యో నమః

# విషాద తిమ్మరుసు నాటకము



## 1 వ. రంగము — విద్యానగర రాజవీథి

[ ప్రవేశము - కామానాయకుఁడు
ఆంధ్రవిజయ పతాకాధారు లగు కొందఱు భటులతో ]

### (1) గే య ము

జై శుభాన్విత భాగ్యోపేతా। జై తేజోయుత జై మాతా
జై సదా, జై సదా, జై సదా జై, భువనఖ్యాతా
జై జై ఆంధ్రమాతా జై
అనాదిభూతా వీరమాతా। ఆంధ్రమాతా జై జై జై
కృష్ణాగౌతమితుంగభద్రా। పినాకినీప్రియమాతా జై
జై జై మాతా నమో నమస్తే। జై జై ఆంధ్రమాతా జై
జై సదా, జై సదా, జై సదా జై, భువనఖ్యాతా
జై జై ఆంధ్రమాతా జై

తే. గాండివికి నాఁడు నారాయణుండువోలె
అవతరించెను నేఁడు తిమ్మరుసుమంత్రి
రక్షకుండుగ శ్రీకృష్ణరాయమణికి
అభ్యుదయ మొందుఁ గాత మా యాంధ్రమాత!

### (2) గే య ము

అనంతకీర్తి పావనమూర్తీ। ఆంధ్రజ్యోతీ జై జై జై
వైరిజయస్ఫూర్తి దివ్యజ్యోతీ। జై చిజ్జ్యోతీ జై జై జై

జై నమస్తే నమో నమస్తే। ఆంధ్రజ్యోతీ జైజైజై
జై సదా, జై సదా, జై సదా జై, అమరజ్యోతీ
జైజైజై పరంజ్యోతీ

జై శ్రీ తిమ్మరుసుమహామంత్రిశేఖరులకు జై!
జై శ్రీ కృష్ణదేవరాయసార్వభౌములకు జై!

[నిష్క్రమింతురు]

---

## 2 వ. రంగము — రాయల సభామండపము

[తిమ్మరుసుమంత్రియు కామానాయకుఁడును గూర్చుండియుందురు.]

భటుఁడు — (వేత్రహస్తుఁడై ప్రవేశించి) శ్రీమన్మహారాజాధిరాజ, వీరప్రతాప, రాజపరమేశ్వర, అష్టదిగ్గజమనోభయంకర, సాహితీసమరాంగణసార్వభౌమ, ఆంధ్రభోజేంద్ర, శ్రీ శ్రీ శ్రీ కృష్ణదేవరాయసార్వభౌమా (అని నిష్క్రమించును)

(తిమ్మరుసు కామానాయకుఁడును లేచి నిలువఁబడుదురు.)

రాయలు — (భటుని వెంటఁ బ్రవేశించి, తిమ్మరుసుదిక్కు మొగమై) అప్పాజీకి అభివందనములు!

తిమ్మ — విజయీ భవ!

కృష్ణ — (సింహాసన మధిష్ఠించి) అప్పాజీ! నేఁటి వార్తావిశేషము లేమి?

తిమ్మ — (లేచి) వత్సా! ఉత్కలదేశాధీశ్వరుండగు ప్రతాపరుద్రగజపతి ఉదయగిరి కొండవీడు మున్నగు దుర్గములను మరల నాక్రమింపఁగోరి నెంచి, పాత్రుల సాయము చాలదని కాఁబోలు, బిజపూర్ గోల్కొండ సుల్తానులతో సంధిప్రయత్నములు సల్పుచున్నాఁడఁట! (కూర్చుండును)

కామా — (లేచి) సమరసన్నాహములు గూడఁ జురుకుగా జరుగుచున్నవఁట!

కృష్ణ — (కోపముతో) ఏమీ గజపతి యున్మత్తత! మొన్న మొన్ననే ఆంధ్రుల పరాక్రమమును జవిచూచియు నింతలోనే విస్మరించెనుగా! సుల్తానులతో సంధియా?

ఉ. మానము నేటఁ గల్పికొని, మాన్యులలోఁ దలవంపు గాఁగ, సు
ల్తానుల నాశ్రయించునె గులామువిధాన సలా మొనర్చుచున్?
ఛీ! నృపలోక మెల్లఁ బ్రహసింపదె తన్నిఁక? వారి సంధిసం
ధానము, ఆంధ్రరాయల విధానము నేఁడె జగం బెఱుంగదే?

ఈ దుస్తంత్రమునకుఁ దగిన ఫలము త్వరలోనే యాతఁ డనుభవించుఁ గాక!
అప్పాజీ! ఉత్కలదేశవిజయయాత్రకై నేఁడే సమరసన్నాహములు......

తిమ్మ— (లేచి) ఒక్కమనవి.

కృష్ణ— ఏ మది?

తిమ్మ— ఇప్పట్టున మనము గజపతికడ కొకమాఱు రాయబారి నంపుట యుత్తమ
పద్ధతి.

కృష్ణ— మీ కిదేమి భ్రాంతి యప్పాజీ! అంతటి నైచ్యమునకుఁ బాల్పడిన యా గజ
పతి యింకను రాయబారములకు మెత్తవడు ననియేనా మీ యూహ?
ఏనాఁటినుండియో ఆంధ్రదేశమును గబళింపఁ జూచుచున్న గజపతి యేమి!
రాయబారములకు లొంగుట యేమి! అదియునుగాక,

ఉ. ఆలములో నరాతినివహంబును డీకొని, నేలఁ బెట్టియుం
గాలను రాచి, మేను కడికండలొనర్చినఁ గాక, రాయబా
రాలను సామవాక్కులను రాజ్యము లబ్బునె? యింకఁ బోరికిన్
జాలనివార మంచల విశాంపతు లెల్లరు గేలి సేయరే?

తిమ్మ— అది సత్యమే. కాని, రణధర్మానుష్ఠానమున మన మేల లోపము చేయవల
యును? ఈవఱకే సుల్తానుల బల మంతయు సన్నగిల్లినది. గజపతియు నయ్యది
యెఱుంగకపోలేదు. కావున సామమునకు లొంగినను లొంగవచ్చును.

ఉ. సామముచేత సంధియె పొసంగనినాఁ డిఁక వైరితోడ సం
గ్రామవిధానమే కలదు గా మఱి! సాహస మేల యింతలోఁ?
దామరసాక్షు హస్తినకు ధర్మజుఁ డెందుల కంపెనో, యతం
డేమిటి కేఁగెనో యెఱుఁగవే? అదియే కద రాజనీతి యహా!

కృష్ణ—(తల పంకించి) మంచిది. అప్పాజిమాటకు రాయ లెన్నఁడు బద్ధుఁడు
గాలేదు? (కామానాయకునిదిక్కు మొగం బై) కామానాయకా!

కామా—(లేచి) ప్రభూ ఆజ్ఞ.

కృష్ణ—నీవు కళింగగజపతికడకు రాయబారివిగా నేఁగి, ఆతనితో మా మాటలుగా నిట్లు తెల్పుము.

ఉ. ఆంధ్రనృసింహుఁరాయల జయార్భటి కోడి, యశంబు వీడి, గ
ర్వాంధుల లాతిజాతుల సహాయతఁ గోరదె దంతిభూప! నీ
బంధురరాజ్యమున్ ప్రజలు బంధులు మిత్త్రులు పెంపుఁ జెందఁగా
సంధి యొనర్చెదో, రణమె సల్పెదో, మాకు నెఱుంగఁ
జెప్పుమా!

మఱియు, నప్పటికి నీకుం దోఁచిన తెఱంగునఁ బ్రసంగించియు, గజపతి యొద్దనుండి శీఘ్రముగ సమాధానముఁ గొని రమ్ము.

కామా—ప్రభువుల యాజ్ఞ. (నమస్కరించి, వెడలును)

కృష్ణ—(లేచి) అప్పాజీ! గజపతి సంధి కెట్లును ఒడంబడఁడు. కావున సమర సన్నాహము లతిశీఘ్రముగా నొనర్పుఁడు.

తిమ్మ—ఆలాగే.

[నిష్క్రమింతురు]

---

## 3 వ. రంగము — తిమ్మరుసు మందిరము

[తిమ్మరుసు ఆలోచించుచుఁ బచారు చేయుచుండును]

కామానాయకుఁడు—(ప్రవేశించి, తిమ్మరుసునకు నమస్కరించి) మంత్రిశేఖరులు నన్నుఁ బిలిపించిన కారణ మేమో?

తిమ్మ—మ ఱేమియు లేదు. ఈ రాయబారపుఁగార్యముతోపాటు నీవు మఱొక చిన్నపని గూడఁ జేయవలసియున్నది. అది యెట్లు సాధింపఁ గలవో యని యోజించుచున్నాను.

కామా—తమ సెల వైనచో నెట్టి కార్యము నైనను సాధింప సంసిద్ధుఁడనే. సంకోచింపక సెల విండు.

తిమ్మ— (నవ్వుచు బుజముఁ దట్టి) నీ సామర్థ్యము నే నెఱుంగనా? అందుకే కదా నిన్ను రావించినది. చూడుము, గజపతి పుత్రిక అన్నపూర్ణ మన రాయల రూపాతిశయమును గర్ణాకర్ణిగా విని, యాతనియం దనురక్తురా లైనట్లు చారులమూలమున వినియున్నాను. నీ వెట్లును అచ్చోటికిఁ బోవుచున్నావు గావున, రాయబారపుఁగార్య మైనవెనుక నేలాగో యవకాశమును గల్పించుకొని, రాయలయందు ఆమె హృదయము దృఢబద్ధ మగునట్లు కావింపుము. మన కళింగదేశవిజయయాత్ర కిది యెంతయు శుభోదయముగాఁ బరిణమింపఁ గలదు,

కామా— చిత్తము. అలాగే చేసెదను.

తిమ్మ— ఇది యంత సులభమైన పని గాదు సుమా! ఎట్లు సాధించెదవో!

కామా— ఇంతగాఁ జెప్పవలయునా స్వామీ! తమ యాశీర్వాదప్రభావమే నాచే ఈ కార్యమును సాధింపఁజేయఁ గలదు. ఇంక నాకు సెల వొసంగుఁడు.

తిమ్మ— క్షేమానఁ బోయి, లాభాన రమ్ము!

కామా— (నమస్కరించి, నిష్క్రమించును)

తిమ్మ— నే నపు డంపిన భద్రుఁడు అన్నపూర్ణ చిత్తవృత్తినిఁ బరీక్షించి యీసరికి రావలసినవాఁడే! ఏల యింత యాలస్యము గావించుచున్నాఁడో!

(ప్రవేశము — భద్రుఁడు)

భద్రు— జయము జయము తిమ్మరుసుమహామంత్రిశేఖరులకు! (నమస్కరించును)

తిమ్మ— (ఆత్రములో) భద్రా! ఫలించినదా కార్యము?

భద్రు— (నవ్వుచు) తాము సంకల్పించుటయుఁ గార్యము ఫలింపకుండుటయునా?

తిమ్మ— (సంతోషముతో) ఎట్లు సాధించితివి?

భద్రు— దేవా! అవధరింపుఁడు. నాఁ డట్లు తమయొద్ద సెలవు గైకొని పోయి, బిచ్చగానివేషముతోఁ గళింగరాజోద్యానపరిసరంబుల ఆ రాజకుమారి సఖితో విహరించుసమయమున మన రాయలవారి బలపరాక్రమసౌందర్యాదులను వర్ణించుపాటఁ బాడుకొనుచుఁ బోవుచుంటిని.

తిమ్మ— (ఆత్రముతో) మఱి యెవ్వరును ఆ పాట వినలేదు గద!

భద్రు— అంత వెఱ్ఱివాఁడనా స్వామీ! నా రిరువురు దప్ప మ ఱెవ్వరును లేని సమయముఁ జూచియే పాడితిని.

తిమ్మ— తరువాత?

భద్రు— అంత నా రాజకుమారి నా పాట నాలించి, తన యాట చాలించి, సఖిచే నన్నుఁ బిలిపించి, ఆ పాట మరల మరలఁ బాడించుకొని విన్నది.

తిమ్మ— వినుటమాత్రమేనా? ఏమైనఁ బ్రశ్నించినదా?

భద్రు— అంతకన్న విశేషమే జరిగినది.

తిమ్మ— ఏ మది?

భద్రు— ఆమెకుఁ గనఁబడునట్లుగా నాయొద్ద నుంచుకొన్న రాయలవారి చిత్రపటమును గాంచి, దాని వెల యెంత యని నన్నడిగినది.

తిమ్మ— తరువాత?

భద్ర— ఇట్టి పటములకు వెల గట్టలేమనియు, వలసినచోఁ దమయొద్దనే యుండనిండనియుఁ జెప్పి, యామె కా చిత్రపటము నొసంగితిని.

తిమ్మ— అటుపిమ్మట?

భద్ర— దానినిఁ దిలకించునప్పుడు ఆమె ముఖము పున్నమచందమామవలెఁ గళకళలాడినది. వెంటనే నన్ను సత్కరించి పంపివేసినది.

తిమ్మ— సెబాస్! భద్రా! సెబాస్! నిజముగాఁ నీవు సార్థకనామధేయుఁడ వోయీ! ఇదిగో యీ రత్నాంగుళీయకమును బహుమానముగాఁ గైకొనుము. (అని వ్రేలినుండి తీసి యిచ్చును)

భద్రు— (వినయముతోఁ గైకొని) మహాభాగ్యము! ఇంక నాకు సెలవా?

తిమ్మ— పోయి రమ్ము.

భద్రు— (నమస్కరించి వెడలిపోవును.)

తిమ్మ— సరే. నా పన్నుగడ ఫలించినట్లే. ఇంక రాయబారపుఁగార్య మెట్లు పరిణమించునో చూడవలయును. ఎట్లు పరిణమించునో యన నేల?

ఉ. తా నొకవేళ సంధికిఁ బ్రతాపుఁడు సమ్మతిఁ జూపుఁగాక, త
త్సూనుఁడు వీరభద్రుఁ డతిదుర్మదుఁ డయ్యది సాగనిచ్చునే?
దీనికి నెల్లఁ దత్సుతయె దీటగు సాధన మెల్లభంగి, అ
ద్దానికిఁ జేయఁగాఁ దగు విధానము సర్వము నిర్వహించెదన్.

(నిష్క్రమించును)

---

# 4 వ. రంగము — గజపతి సభామండపము

[గజపతి, కుమారుఁడు వీరభద్రుఁడు, మంత్రి ఈశ్వరభట్టు గూర్చుండి యుందురు.]

గజ— అమాత్యశేఖరా! సమరసన్నాహము లన్నియుఁ బూర్తియైనవి కదా!

ఈశ్వ— చిత్తము, చాలవఱ కయినవి.

గజ— ఈమాఱు మనకు సుల్తానుల సాయము గూడ సమకూరుటచే మన యావచ్ఛక్తిని వినియోగించి, కోలుపోయిన దుర్గములనే కాక యావదాంధ్రదేశమును మరల వశపఱచుకొనవలయుఁ జుఁడీ!

ఈశ్వ— మనము సుల్తానుల సాయము నపేక్షించినను వా రీవఱకే రాయలకు లొంగియుండుటచే మనకు సమయమునకుఁ దగినంత సాయమును జేయ జంకుదు రేమో!

వీర— ఎవరి సాయము మన కేల? అవక్రపరాక్రమోపేతు లగు గజపతుల పేరు విన్నంతనే రాయలు కాదు గదా, ఆతని యబ్బ యైనను గజగజ వణంక వలసినదే.

ఉ. చించెద వైరిరాడ్బలముఁ జేవ దలిర్పఁగ; నెత్తుటేఱు పా
ఱించెద భండనక్షితిని; రేఁగెడు రాయల గర్వ మెల్లఁ దూ
లించెదఁ; గోర్కె దీరఁ బెకలించెదఁ దిమ్మరుసయ్యగుండియల్;
నించెద దిక్కులన్ యశము; లే రనిపించెద నెందు మత్సముల్.

గజ— వత్సా! తొందరపడకుము. ఈశ్వరభట్టారకు లన్నమాట యథార్థమే. అదిగాక, అగ్నికి వాయువు తో డైనట్లు ఆ రాయలకు మహామేధావి యగు తిమ్మరుసుమంత్రి యండగా నున్నాఁడు. ఆతని బుద్ధివైభవము ప్రతాపమును గొండవీటియుద్ధమున మన కందఱకును దెలిసినవే కదా! ఆ మహామంత్రియే లేకున్న, నాఁడు రాయల కా దుర్గము వశ మైయుండెడిదా?

వీర— తండ్రీ! మీరే శాత్రవుని మెచ్చుకొన నారంభించినపుడు నే నింకే మనఁగలను?

ఈశ్వ— రాజకుమారా! మనలో మనము మేల్గీళ్ళ నారయుటలోఁ దప్పేమి యున్నది? మఱియు నెంత గర్భశత్రువునం దైనను గుణలేశ మున్నచో మెచ్చుకొనుట గుణజ్ఞులకు సహజమే కదా!

వీర— ఆహా యేమి యీ గుణజ్ఞత! ఇది గుణదోషవిచారణకుఁ దరుణము కాబోలు!

ఈశ్వ— నేఁడో రేపో రాయలు మనయొద్దకు రాయబారి నంపినను నంపవచ్చును.

గజ— దిగ్విజయోన్మత్తుఁడగు రాయ లేమి? రాయబార మంపుట యేమి?

ఈశ్వ— అట్లు గాదు. రణధర్మమర్మకోవిదుం డగు తిమ్మరుసుమంత్రి యుండఁగా అన్యథా జరుగ నేరదు.

వీర— అటులే జరిగిన, వారి భీరుత్వమును వారే వెల్లడించుకొన్నవా రగుదురు.

భటుడు— [ప్రవేశించి నమస్కరించి] ప్రభూ! రాయలవారియొద్దనుండి రాయబారి యొకఁడు వచ్చి దేవర దర్శనార్థము వెలుపల వేచియున్నాఁడు.

గజ— లోనికిఁ బ్రవేశపెట్టుము.

భటు— చిత్తము. [నిష్క్రమించును]

గజ— భట్టారకా! మీరు లెస్సగా నూహించితిరి.

వీర— ఇప్పుడు తెలిసెఁ గదా వారు ధీరులో భీరులో? లేకున్న ఈ తరుణ మేమి? రాయబార మంపుట యేమి?

గజ— వత్సా! తొందర యేల? అ దెట్టి సందేశమో తెలిసికొని మఱి నిర్ణయింతము.

[ప్రవేశము — కామానాయకుఁడు]

కామా— (వినయముతో) శ్రీ గజపతిమహారాజులకు నమస్కృతులు.

ఈశ్వ— (ఆసనమును జూపును)

కామా— (కూర్చుండును)

గజ— ఓయీ! నీ పే రేమి? నీవచ్చిన కార్య మెయ్యది?

కామా— నన్నుఁ గామానాయకుఁ డందురు. రాయలవారి రాయబారినిగా వఁగు దెంచితిని. (లేచి) మహారాజా! అవధరింపుఁడు. ఇదే శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముల సందేశము.

ఉ. ఆంధ్రనృసింహరాయల జయార్భటి కోడి, యశంబు వీడి, గ
ర్వాంధుల లాతిజాతుల సహాయతఁ గోరు దె దంతిభూప! నీ
బంధురరాజ్యమున్ బ్రజలు బంధులు మిత్త్రులు పెంపుఁ జెందఁగా
సంధి యొనర్చెదో, రణమె సల్పెదొ, మాకు నెఱుంగఁ
జెప్పుమా!

వీర—(పండ్లు పటపట గొఱుకుచుఁ గోప మభినయించును)

గజ—(కోపముతో) ఏమి మీ రాయల యౌద్ధత్యము! జయాపజయములు దైవాధీనము లని యెంచక యొకసారివిజయమునకే తానే లోకమున శూరాగ్రేసరుఁడ నని విఱ్ఱవీఁగఁజొచ్చెనుగా! మంచిది, మా మాటలుగా మీ రాయల కిట్లు తెల్పుము.

ఉ. భండనభూమి నిల్చి, రిపువర్గము గెల్చి, యశంబుఁ గాంచుటో!
నిండు మగంటిమిన్ నెఱపి, నిర్జరలోకసుఖంబు నందుటో!
ఉండును క్షాత్త్రతేజమున కొండు విధం బిఁక ? ఈ ప్రతాపరు
ద్రుం డన నేమిగాఁ దలఁచితో! కనన య్యెడు నేఁడె భూవరా!

వీర—(తనలో) సెబాస్! తగిన సమాధాన మిచ్చినారు మా తండ్రి.

కామ—ప్రభువుల యాజ్ఞ. కాని, మహారాజా! శాంతియుతముగా జరుగఁ దగు కార్యమునకై యసంఖ్యాకుల ప్రాణములు బలి యొసంగుట రాజునకుఁ గాని సామ్రాజ్యమునకుఁ గాని యంత క్షేమము గాదేమో! అదియునుగాక,

తే. గాండివికి నాఁడు నారాయణుండువోలెఁ
బాయ కీనాఁడు శ్రీకృష్ణరాయమణికి
దైవసన్నిభుఁ డప్పాజి దండ నుండఁ
జెనక శక్యంబె ఫాలలోచనున కేని ?

వీర—(పట్టరాని కోపముతో) ఛీ చాలింపు మింక నీ యసంబద్ధప్రలాపములు!

(3) గేయము

ఓరీ వాచాటా! ఏ మని ప్రేలితివి? మిమ్ము జయింప ఫాలాక్షున కేని శక్యము గాదేమి ?

శా. ఫాలాక్షుం దెగ నాడ్డునంతటి మదంబా! యోరి పాపాత్మ! మీ
కాలం బన్న భయంబు లేని యెడ దాత్యం బేలరా యిట్లు ? శుం
ఠా! లజ్జింపక ప్రేలఁ జొచ్చితివె! నిన్ ఖండించి, నీ రక్తధా
రాళిన్ దర్పణముం బొనర్తు నిదె ఫాలాక్షుండు తృప్తుండు గాన్.

(కత్తి దూసి మీఁది కుఱుకును)

గజ— (వారించి) ఆఁ ఆఁ వత్సా! శాంతింపుము!

తే. వైరిపై కోపమున రాయబారిమీఁద
వాలు దూయుదురే రాచపాడి దొఱఁగి?
దాయ కిప్పట్లఁ దగు సమాధాన మొసఁగి
అంపఁ దగుఁ గాని, యిది యశోహాని గాదె?

(కామానాయకునిదిక్కు మొగంబై) ఓయీ! రాయలు నిన్ను రాయబార మొనర్పఁ బంపెనే కాని, మాకు రాజనీతి నుపదేశించుటకుఁ గాదు గదా! మా సమాధానమును గొని నీ వింకఁ జనవచ్చును.

కామా— చిత్తము (అని, వెడలిపోవుచుండఁగా)

వీర— (వెనుకకుఁ బిలిచి) ఓరీ! మీ ఱేనితో నే నిట్లంటి ననియుఁ జెప్పుము!

చ. ఎవని బలాన నీకు నెదు రెందును లేరని విఱ్ఱవీఁగెదో,
ఎవఁడుఁ గతింప నీదు బ్రతుకే తెలవాఱునో, అట్టి దుర్ణయా
ర్ణవు దురితాత్ము తిమ్మరుసురక్కసు దారుణమారణంబె యా
బవరమునన్ దుదిన్ భరతవాక్యము కాఁగలదం చెఱుంగుమా!

కామా— (తనలో) వినాశకాలే విపరీతబుద్ధిః.

(నిష్క్రమించును)

గజ— వత్సా! ఏటి కా తిమ్మరుసుమంత్రిపై నీ కింత యాగ్రహము? బ్రాహ్మణుని మీఁదనా నీవు క్షాత్త్రమును జూపుట?

వీర— ఏనాఁ డాతఁడు కత్తి పట్టెనో ఆనాఁడే తన బ్రాహ్మణధర్మమును గోల్పోయినాఁడు. నాఁటి కొండవీటి యుద్ధమున నాతఁడు చూపినది బ్రాహ్మణధర్మమనియే యందుగా?

గజ— అందుఁ దప్పేమి యున్నది? ప్రతిభకుఁ దోడు శౌర్యమును గలవాఁ డగుటచే అంతటి పరాక్రమమును జూపెను. అందువలన బ్రాహ్మణత్వమునే కోల్పోయి నట్లా? భారతయుద్ధమునఁ గుంభసంభవుఁ డట్టివాఁడే కదా!

వీర— మఱి, బ్రాహ్మణుఁ డని ద్రోణునిపై దయఁ జూపిరా పాండవులు?

గజ— నీ కింకను ధర్మసూక్ష్మము బోధపడినది గాదు వత్సా!

వీర— నా కిప్పట్టున మారణధర్మము దక్క వేఱు ధర్మములతో నిమిత్తము లేదు.

సూర్య— ఇఁక రాయలతో యుద్ధము తప్ప దనుమాట నిశ్చయ మైనది.

వీర— ఇంకను సందేహమా ?

గజ— అమాత్యశేఖరా ! ఇఁక సమరసన్నాహము లతిశీఘ్రముగాఁ బూర్తి గావింపుఁడు. రాయలు మనపై కెత్తివచ్చుటకు ముందు మనమే యాతనిపై కుఱుకవలయునుజుఁడీ ! పాత్రులను గూడ హెచ్చరింపుఁడు.

ఇ— చిత మశే.

(అందఱు నిష్క్రమింతురు)

---

# 5 వ. రంగము — గజపతి యుద్యానవనము

[ ప్రవేశము — కామానాయకుఁడు ]

కామా— ఆహా ఏమి విచిత్రదైవసంఘటనము ! రాయబారపుఁగార్యమే విఫలమైనదే, యింక నీ కామదూత్య మెట్లు సఫలము కాఁగలదో యని యోజించుచుండ— అడఁ బోయిన తీర్థ మెదురైన దన్నట్లు— అన్నపూర్ణాదేవి ప్రాణసఖి యఁట మాధురియే నన్నుఁ గలిసికొని తన చెలివిషయమై నాతోఁ బ్రస్తావించినది. మఱియు నెందులకో న న్నీయుద్యానవనమ్మునకు ర మ్మనియుఁ జెప్పినది !

(ఎదుటఁ జూచి) అదిగో ఆమెయే కాఁబోలు అన్నపూర్ణాదేవి ! విహారార్థమై యుండనోపు ఈయెడకే వచ్చుచున్నది. ఆహా యేమి యీ తల్లి లావణ్యము ! ఈమె సర్వవిధముల మా రాయలవారికే తగియున్నది గదా ! కానిమ్ము, ఈ పొదరింటనే డాఁగి యుండి యీమె చిత్తవృత్తినిఁ గనిపట్టెదఁ గాక ! (పొదరింట డాఁగి యుండును)

[ ప్రవేశము — అన్నపూర్ణ రాయల చిత్రపటముతో ]

అన్న— (చిత్రపటమువంకఁ జూచుచు) ఆహా యేమి యీతని సమ్మోహనసౌందర్యము !

* (4) గేయము

ఈ దివ్యమంగళవిగ్రహునిఁ జెట్టపట్టఁగల కన్య యెంత ధన్యయో కదా! (ఆలోచన నభినయించి) ఈ చిత్రపటము నాకు సంతోషకారణంబును సంతాప కారణంబును అయ్యెనే! ఔరా విధివిలాసము!!

సీ. ఎలదోఁటలో నాఁడు చెలితోడఁ గడుప్రొద్దు
విహరింప నా కేల వేడు కాయె!
ఆయెఁ బో, అవ్వేళ కాపాంతనే యేల
గాయకుం డా బిచ్చగాఁడు వోయెఁ!
బోయెఁ బో, అవ్వానిఁ బోనీక రావించి
పాడించి విన నేల బాళిఁ గొంటిఁ!
గొంటిఁ బో, యేల కైకొంటిఁ జిత్రపటమ్ము!
నాలోన నేలా విరాళిఁ గంటిఁ!

తే. గంటి కేప్రొద్దు నిదురయే కఱవు గాఁగ
దుర్లభజనానురాగసింధువునఁ దోఁగి
యేల యీలీల నేఁ జాల బేల నైతిఁ!
గలదొ! యింతయు దైవసంకల్పబలము!!

(చిత్రపటమునందలి రాయల నుద్దేశించి) మనోహరా!

తే. ఎటులొ చేరిన యీ చిత్రపటమునందు
నిన్నుఁ గన్నది మొదలు నే నన్ను మఱచి
తెన్ను గానక తపియించుచున్నదాన;
నన్ను మన్నించు టెన్నఁడో పన్నె కాఁడ!

---

* ఉ. కాయజు సింహపీఠి యనఁగాఁ దగు పేరుటురమ్ము, సంజకెం
జాయలఁ బర్వఁజేయు నను జక్కెర మోవిమెఱుంగు, సోగకం
దోయి బెడంగు, చిర్నగవుతోడి మొగంబు, పసిండిఁ గేరుమై
చాయయుఁ గల్గు నీకుసుమసాయకుఁ బొందెడి కన్య ధన్యగా!

[ ప్రవేశము — మాధురి ]

మాధు— సఖి! ఇక్కడ నుంటివా? నీకై యెక్కడెక్కడనో వెదకితిని గదా!

అన్న— ఎందుకే అంత శ్రమ?

మాధు— నీతో.........

అన్న— నాతో నేమి?

మాధు— ఒక మాట చెప్పవలె నమ్మా!

అన్న— (ఆత్రముతో) రాయబారపువృత్తాంతమేనా మాధురీ? సుముఖమే కదా!

మాధు— అయ్యో యెంత యమాయికురాలవమ్మా! గజసింహముల కెన్నఁడైనను మైత్రి పొసంగునా?

అన్న— (నిరాశతో) అంతేనా సఖి? (నిట్టూర్చి) నా వన్నియు రిక్తవాంఛలు గావల సినవేనా? ఇందుల కేదేని యుపాయము లేదా మాధురీ?

మాధు— లేకేమి? దానికిఁ జేయఁదగిన దంతయుఁ జేసియే వచ్చితిని.

అన్న— (ఆత్రముతో) చెప్పుము చెప్పుము ఏమి చేసితివి?

మాధు— (అన్నపూర్ణ చెవిలో నేమో చెప్పును)

అన్న— (సంతోషముతో) అతఁ డందుల కియ్యకొనెనా?

మాధు— ఇయ్యకొనక? సరేకాని, నీవు సత్వరము నీ ప్రియునకుఁ బ్రణయలేఖను లిఖింపుము. ఆలసించినఁ గార్యభంగ మగును.

అన్న— (భయము నటించుచు) అమ్మో ప్రణయలేఖయే?

మాధు— ఎందు కమ్మా అంత భయము?

అన్న— ఏమో యెట్లు పరిణమించునో!

మాధు— విధిగా నిన్నుఁ బరిణయించును.

అన్న— సాహస మగునేమో!

మాధు— ఆఁ! సాహసము లేకున్న సంకల్పము కొనసాగు టెట్లమ్మా?

అన్న— (తల పంకించి) సరే, పత్రిక లేఖినియు నిటు తెమ్ము.

మాధు— (వెదకి పోషుచుండును)

అన్న— (వెనుకకుఁ బిలిచి) సఖి! నా చిత్రపటమును గూడ.

మాధు—అలాగే (పోయి, చిత్రపటముతోఁగూడఁ బత్త్రిక లేఖినియుఁ దెచ్చి యిచ్చును)

అన్న—(కైకొని, ఆలోచన నభినయించుచుఁ జిత్రపటముక్రిందనే ఒక పద్యమును వ్రాసి, మాధురిచేతి కిచ్చి) చూడు చెలీ, సరిగా నున్నదేమో!

మాధు—(తనలోఁ జదువుకొని) బలే! ఇది ప్రణయలేఖ కాదు, వశీకరణమంత్రమే.

అన్న— చాలులే నీ పరిహాసాలు,

[ కామానాయకుఁడు పొదరింటినుండి యీవలకు వచ్చుచుండును ]

మాధు—(చిత్రపటమును గైకొని, యెదుటఁ జూచి) అడుగో అతఁ డీయెడకే వచ్చుచున్నాఁడు. నే నెదు రేఁగి యాతని కిది యిచ్చి వచ్చెదను.

కామా—(దూరముగా నిలుచుండి) మాధురీ! ఇఁక నే నిక్కడ నాలసింపరాదు. నాతో నేమైనఁ బని గలదా?

మాధు—లేకున్న మిమ్మిక్కడ కేల రమ్మందును? ఇదిగో రాజకుమారి చిత్రపటము. రాయలవారి కందఁజేయుఁడు (చిత్రపటము నిచ్చును)

కామా—(కైకొని, కన్నుల కద్దుకొని) నే నిఁకఁ బోయి వచ్చెదను.

మాధు— ఆర్యా! మా చెలి సిద్ధమనోరథ యగునట్లు చూడుఁడు.

కామా— అవశ్యము. (నిష్క్రమించును)

అన్న—(ఆనందముతో) సఖీ! నీ వెంత మంచిదానవే! నన్నీనాఁడు ఆనందాబ్ధిలో ముంచి తేల్చితివి గదా!

మాధు—సరే దీని కేమి గాని, యిఁక నీవు చక్రవర్తిని వైనపుడు నేను జ్ఞాపక ముందునా సఖీ?

అన్న— పరిహాస మఱే చెలీ? ఒకవేళ నన్నాయన నిరాకరించినచో.........

మాధు— ఆఁ! ఎంత మాట! నిరాకరించుటకు నీవంటి రూపవతు లెక్కడ నున్నారని?

అన్న— అది కాదే.

మాధు— మ ఱేది?

అన్న—ఎట్లో యొకవేళ మా తండ్రి యీ సంబంధమునకు సమ్మతించు ననియే యనుకొందము; మఱి మా యన్నమాత్ర మియ్యకొనఁడు గదా! అతఁడు,

రాయలవారి పేరెత్తిననే మండిపడుచుండును. అట్లే ఆయన గూడ శత్రురాజు పుత్రిక నని నన్ను అనుగ్రహించునా యని.........

మాధు— మీ తండ్రి సమ్మతింపవలయునేకాని మీ యన్న దే మున్నది? మఱి నీ చిత్రపటమును జూచినవెనుక రాయలవారికి శత్రుభావము గూడ నుండునా సఖీ?

(5) గేయము

[ఇరువురు నిష్క్రమింతురు]

## 6 వ. రంగము — రాయల మందిరము

[రాయలు అన్నపూర్ణచిత్రపటమును దిలకించుచుండును]

కృష్ణ— (తల పంకించి, చిఱునవ్వుతో) ఆహా యేమి యీ లతాంగి లావణ్యము!

తే. కొమ్మ గా దిది బంగారుబొమ్మ గాని
ఇంతి గా దిది జాజిపూబంతి గాని
కలికి గా దిది మరుని పూములికి గాని
భామ గా దిది లావణ్యసీమ గాని.

కామానాయకుఁడు వచించినది యథార్థమే.

ఉ. మున్ను ప్రశస్తి గన్న పువుఁబోఁణుల నెందఱిఁ జూడలే, దహా!
ఎన్నఁడు నిట్టి రూపవతినే కననైతిని గాక; నేఁడుగా
కన్నులు గల్గినందులకుఁ గంటి ఫలంబు! ముదంబు మీఱ నిం
కిన్నలినాక్షిఁ బొందు ఘటియిల్లిననే కద జన్మ ధన్యమౌ!

[చిత్రపటముక్రిందఁ జూచి] ఇం దేదియో లిఖింపఁబడియున్న దే! [అని, చదువును]

తే. ఎంత ధన్యయో రుక్మిణీకాంత నాఁడు
ఎట్టకేలకుఁ గృష్ణుఁ జేపట్టఁ గలిగె!
నామగుణసామ్య మెంచి నిన్ వలచి నేఁడు
ఎటు కృతార్థతఁ జెందునో యీ నెలంత!

ఓహో యేమి రచనాచమత్కృతి! ఎంత ప్రౌఢిమ! ఈ కార్యమును నిర్వహించు భారమును గూడ నాపైననే మోపినదే! [యోజించి, తల పంకించి] అప్పాజీ యాశీర్వాదబలమే యున్నచో...

[ప్రవేశము — తిమ్మరుసు]

తిమ్మ— వత్సా! ఏమి యోజించుచున్నావు?

కృష్ణ— (లేచి, కూర్చుండ నాసనమును జూపి) కామానాయకుఁడు తెచ్చి యిచ్చిన యీ చిత్రపటమును దిలకించుచున్నాను అప్పాజీ! [అని, తిమ్మరుసునకుఁ జిత్రపటమును జూపును]

తిమ్మ— (చూచి, నవ్వుచు) ఏమీ కళింగరాజ్యలక్ష్మి అప్పుడే నిన్ను వరించినదే!

కృష్ణ— అంతయు మీ యనుగ్రహవిశేషమే.

తిమ్మ—

తే. భండనంబున నిన్నుఁ జేపట్ట నున్న
యల జయశ్రీయె అన్నపూర్ణాహ్వయమునఁ
బ్రణయసందేశ మను శుభాహ్వాన మంపి
బళిర! చేకూర్చె నీ కుమాభర్తృగరిమ.

కృష్ణ— (మందహాసముతో) అహో ఎంత గంభీరభావబంధుర మప్పాజీ మీ హృదయము!

తే. గజపతికి మాఱుఁ జుట్టఱికంబుఁ గూర్చి
శైవవైష్ణవసామరస్యంబు నెఱప
లెస్స సూచించు మీ శుభాశీస్సు బళిర!
వరకృపావృష్టి యుష్మదద్వైతదృష్టి!!

తిమ్మ— సర్వమతసామరస్యసంధానమే కదా మఱి, విజ్ఞానమునకు విశాలహృదయ మునకును చిహ్నము!

కృష్ణ— వాస్తవమే......కాని, గజపతి యొసంగిన సమాధానమున కేమనెదరు?

తిమ్మ— అనుట కేమున్నది? మన మంపిన సందేశమునకుఁ దగియే యున్నది.

కృష్ణ— ఎట్లు?

తిమ్మ— ఆతఁడును సుత, క్షత్రియుఁ డగుటచే జాత్రితేజ మిట్టి దని వక్కాణించినాఁడు. మనము మాత్రము దానినిఁ గాదనఁ గలమా?

కృ— అటులైన ఆతని వైఖరి మన కనుకూలించు ననియేనా మీ తలంపు?

తిమ్మ— ప్రతికూలింపకపోవచ్చును.

కృష్ణ— అట్లు మనరాయబారిపైఁ గత్తి దూసిన నీతిహీనులు ప్రతికూలురు కాక పోవుట యెట్లు?

తిమ్మ— కత్తి దూసినది గజపతి కాఁడు, మఱి వీరభద్రుఁడు.

కృష్ణ— అతఁడు మాత్రము ఆ తండ్రి కొడుకు కాఁడా?

తిమ్మ— అయిన నేమి? అంతమాత్రాన ఆ యుభయులలో భేదమే లేదా?

తే. తండ్రి సుగుణంబు లతని సంతతికి నెల్ల
సంక్రమించు నటన్న నిశ్చయము గలదె?
అల్లదే లక్ష్మియును మఱి హాలహాలము
పాలకడలిన కాదె యుద్భవము నొందె!

కృష్ణ— సత్యమే...కాని, ఆ తండ్రి యోగ్యత మాత్ర మేమి బయల్పడినది?

తిమ్మ— బయల్పడ కేమి? మన సంధిసందేశమునకుఁ దా నుద్రిక్తుఁడు కాకుండు టయే కాక, ఉద్రిక్తుఁ డై అవినీతికిఁ బాల్పడిన వీరభద్రుని వారించి, రాయ బారివట్ల రాచపాడి నెఱపుట చాలదా గజపతి శీల మెట్టిదో గ్రహించుటకు? వయస్సుచే లోకానుభవముచే ఆతఁడు కాఁగి చల్లారిన పాలవంటివాఁడు.

కృష్ణ— అతఁ డెట్టివాఁ డైన నేమి? ఆంధ్రదేశము నాక్రమించుకొన నెంచిన దుశ్చింతుఁ డగుటచే ఆదినుండియు మన కాతఁడు వైరియే. అదియును గాక, నిమ్ముఁ గూర్చి అట్లు కాఱులు ప్రేలిన యా వీరభద్రహతకుని హాతమార్చు వఱకు నా మనస్సునకు విశ్రాంతి కలుగనేరదు. కావున సమరసన్నాహము లన్నియు సత్వరమే పూర్తి గావింపుఁడు.

తిమ్మ—అన్నియుఁ బూర్తి యైనవి.

కృష్ణ—అటులైన నేఁడే మన సేనలు కళింగదేశమునకుఁ గదలి పోనిండు.

తిమ్మ—(తనలో) ఓహో చిత్రపటమును జూచినప్పటినుండియుఁ గళింగదేశయాత్రకై ఈతనికి ఆత్ర మధిక మైనది.

(ప్రకాశముగా) అలాగే. కాని, మనము చైత్రయాత్ర వెడలుటకు ముందు నగరరక్షణమునకై సేనాధిపతుల నొకరిద్దఱ నియమింపవలసి యున్నది.

కృష్ణ—[నవ్వుచు] అప్పాజీ! నా మనసు పరీక్షింపఁ గోరి, నాచేఁ జెప్పింప నెంచితిరే కాని నగరరక్షకుఁ దగినవా రెవ్వరో మీకు మాత్రము తెలియదా?

తే. అమరగురు మించు ధీశాలు లైనవారు
శూలినేనియుఁ దలఁ గోయఁ జాలువారు
అన్నివిధముల మీకు దీటైనవారు
లేరె మీ తమ్ముఁడును, మీ కుమారవరుఁడు?

కావున సత్వరము వారి నుభయులను నగరరక్షకై నియమింపుఁడు.

తిమ్మ—అట్లే కానిమ్ము......మఱొక విషయము.

కృష్ణ—ఏ మది?

తిమ్మ—మనము ఇంతవఱకు నొనర్చిన యుద్ధము లన్నియు నొక యెత్తు, ఈ యుద్ధ మొక యెత్తు సుమా!

కృష్ణ—ఎందువలన?

తిమ్మ—కళింగమునకుఁ బోవు మార్గము మహోన్నతపర్వతపంక్తులతోడి దుర్గ ఘోరారణ్యభూయిష్ఠము.

కృష్ణ—అయిన నేమి?

తిమ్మ—అందుచే శత్రువుల కయ్యది యనుకూలంబును, మనకుఁ బ్రతికూలంబును గావచ్చును.

కృష్ణ—అటులైనఁ బర్వతముల భేదింతము, అరణ్యముల ఛేదింతము. ఇంతే కదా!

తిమ్మ—అది యంత సులభసాధ్యమైన పని కా దోయీ!

కృష్ణ—మన వీరభటుల కయ్యది యెంత పని అప్పాజీ?

తిమ్మ— అంతే కాదు. ఆ గజపతి కిపుడు ఒకవైపు పాత్రులును, మఱొకవైపు సుల్తానులును సహాయులుగా నుండుటచే ఈమాఱు ప్రత్యక్షయుద్ధ మంత సుకరముగా నుండు నని తోఁచదు.

కృష్ణ— మీ బుద్ధిబలముముందు వారి పశుబల మేపాటి దప్పాజీ?

శా. నాఁ డా క్రీడికి భారతాహవమునన్ నారాయణుండట్లు, లీ
నాఁ డీరీతిగ నాకు మీరు మదగణ్యంబైన పుణ్యంబునన్
దోడై సర్వము నిర్వహింప, రిపుసందోహంబుఁ జెండాడి య
ల్లాడం జేయనె? పెక్కుమాట లిఁక నేలా? నేఁ డిదే చూడుఁడీ!

తిమ్మ— కాని వత్సా! నీవుమాత్ర మీ యుద్ధమం దెట్టి సాహసమునకును జొరక, కడుంగడు జాగరూకుఁడవై మెలంగవలయుఁ జుమా!

కృష్ణ—మీ యాజ్ఞ మేరకు వర్తించెదను.

[ తెరలో ప్రయాణభేరి మ్రోఁగును ]

తిమ్మ— అదిగో ప్రయాణభేరి! మనకు వేళ యైనది. రమ్ము పోదము.

[ నిష్క్రమింతురు. ]

## 7 వ. రంగము — కళింగరాజ్యప్రాంతము

[ ప్రవేశము — యుద్ధవేషముతో రాయలు ]

కృష్ణ— (ఆనందముతో)

ఆహా! యీ కళింగరాజ్యప్రాంతమునఁ గాలిడినదిమొదలు నా కేమో యనిర్వచనీయమగు నానంద ముదయించుచున్నదే!

( ఊహ నటించుచు )

తే. తొగలరాయనిఁ గేరు ఆ నగుమొగంబు
కలువఱేకుల మీఱుఁ గన్గవ బెడంగు
కన్ను మూసినఁ దెఱచినఁ గానిపించు
బళిర! మఱవంగఁ దరమె యా నెలఁత సొంపు!

(తెరలోఁ గలకలము)

(ఎదుటఁ జూచి) ఏమా కోలాహలము! సైన్య మంతయు స్తంభీకృత మైనదే! (ఎలుఁ గెత్తి) ఓహో యోధవీరులారా! ఏల యట్లు పురోగమనంబు మాని నివ్వెఱపడి చూచెదరు?

శా. మత్తారాతిమదేభయూధములకుం బంచాననప్రక్రియో
ద్వృత్తిన్ వీరవిహారముల్ సలుపు మీ రీలీల నేలా సము
ద్యత్తేజంబును గోలుపోయి వెఱఁ గందన్? నే నిచే వచ్చితిన్
గత్తుల్ దూసి యరాతితండముల డొక్కల్ చీల్చి చెండాడుఁడీ!

(కత్తి దూసి రణరంగమున దూఁకఁబోవుచుండును)

[తెరలో]

శా. చాలుం జాలు నిదేటిసాహసము వత్సా! యిట్టు లేకాకి వై
యేలా దూఁకెదు భండనావని నహో! యీ సాహసస్ఫూర్తికిన్
గాలంబా యిది? నల్గడల్ రిపులు మూఁగన్ గానవే? ఆఁగు! మీ
లీలన్ జేనికి నొంటిగాఁ జనుట మేలే? కృష్ణరాయాధిపా!

కృష్ణ— (ఆలించి) ఏమది అప్పాజి కంఠధ్వనివలె నున్నదే! కాక, నన్ను వత్సా యని పిలుచునంతటివార లెవ్వరు? (ఎదుటఁ జూచి) అరుగో అప్పాజియే!

తిమ్మ— (తొందరగాఁ బ్రవేశించి) వత్సా! ఏమి యీ సాహసము! శత్రుమధ్యము నకుఁ బోవల దని నే నంతగాఁ జెప్పియున్నను సమయమునకు మఱచితివిగా!

కృష్ణ— అప్పాజీ! నా యపరాధమును మన్నింపుఁడు. శత్రువీరులు విజృంభించు టయు, మన యోధవీరులు స్తంభించుటయుం జూచి సైరింపఁజాలనైతిని.

**తిమ్మ—** సాహస మొనర్చుట కిది సమయము గాదోయీ! ఇరువైపులను రిపువర్గము ముట్టడించియుండుటచే మన మిపు డపాయమునకు గుఱియైతిమి సుమా!

కృష్ణ— (ఆశ్చర్యముతో) అపాయమా?

తిమ్మ— లేకున్న మన సేన లిట్లు స్తంభించుట యేల?

కృష్ణ— అటు లయిన మన కిపుడు కర్తవ్యము?

తిమ్మ— భేదోపాయమే. కౌటిల్యనీతిచేఁ దక్క వేఱొక సాధనమున నిపుడు శత్రువులను వశపఱచుకొనుట దుర్ఘటము. అదే యోజించుచున్నాను. (ఆలోచన నటించును).

కృష్ణ— బుద్ధివైభవమున బృహస్పతిని మించిన మీ కసాధ్య మనునది గలదా? రాజ్యము లేలించినను దూలించినను భవాదృశులే కదా!

సీ. ప్రద్యోతుఁ గికురించి, వత్సేశుఁ గాపాడె
ఘనుఁడు యౌగంధరాయణుఁడె కాదె!
నందులన్ మాయించి, చంద్రు గద్దియ నిల్పె
ధీరుఁడౌ చాణక్యసూరి కాదె!
ఢిల్లీశు నోడిచి, యోర్గల్లురుద్రునిఁ బ్రోచెఁ
దంత్రజ్ఞుఁడౌ యుగంధరుఁడె కాదె!
మనుమభూపాలు సామ్రాజ్యంబునన్ నిల్పె
వెండియున్ దిక్కనార్యుండె కాదె!
హరిహరబుక్కరాయంద్రచే నేలించెఁ
ద్యాగి విద్యారణ్యయోగి కాదె!
తే. నాఁటికిన్ నేఁటికిన్ మఱే నాఁట
సాటి యెందును లేని మీబోటి ఘనుల
ప్రతిభయే కాదె భూరిసామ్రాజ్యములను
మించి రాజులచేత నేలించుచుంట !!

మఱి యీనాఁడు.

తే. ఇంత సామ్రాజ్య మే నిట్టు లేలు టెల్లఁ
బలుక నేటికి, మీ చేతిచలువఁ గాదె!
ఉర్వి నప్పాజియే లేకయున్న నేఁడు
కృష్ణరాయల కీర్తి కిం కేది దిక్కు ?

అప్పాజీ! ఎట్లయినను ఈ యుపద్రవమునుండి యుద్ధరించి, ఆంధ్ర తేజమును నిల్పఁ బెట్టునట్లు నన్నాశీర్వదింపుఁడు! (మోకరించి నమస్కరించును)

తిమ్మ— (లేవ నెత్తి) వత్సా! నా యాశీర్వాదమున కేమి?

తే. ఉత్కలశ్రీకరగ్రహణోత్సవమున
ఆంధ్ర తేజంబు ఆంధ్రత్వ మాంధ్రయశము
చిరతరస్థాయిగాఁ బ్రతిష్ఠింపుమయ్య!
ఆంధ్రభోజేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!

కృష్ణ— ధన్యోఽస్మి ధన్యోఽస్మి!

తిమ్మ— ఈవలకే మన కా పదునార్గురు పాత్రులతో సంధి కుదిరినట్లుగా వారికి మన చారులచే జాబులను గానుక పెట్టెలను బంపి, గజపతికిని వారికిని అంతః కలహములు కలుగఁజేసెదను. దానితో మన కార్య మనుకూలము కాఁగలదు. కాని, వత్సా! నీవు మాత్ర మీనాఁడు నన్ను వీడియుండరాదు సుమా!

కృష్ణ— అవశ్య మట్లే కావింతును.

తిమ్మ— రమ్ము పోదము.

[ నిష్క్రమింతురు ]

---

## 8 వ. రంగము — గజపతి మందిరము

[ గజపతియు, మంత్రి ఈశ్వరభట్టు, కూర్చుండి యుందురు ]

గజ— ......మటి పాత్రు లెట్లున్నారు?

ఈశ్వ— ఏమో వారి వైఖరిఁ జూడ ననుమానాస్పదముగానే యున్నది.

గజ— [ఆశ్చర్యముతో] ఆఁ! రాయలతో యుద్ధ మొనర్ప ననుజ్ఞ యిప్పింపుఁడని యానాఁడు వారే నన్నుఁ గోరిరే!

ఈశ్వ— నిజమే. కాని, సామంతు లగుటచే నెన్నఁటికేని వారికి స్వాతంత్ర్యాభిలాష యుండకపోవునా?

[ తెరలోఁ గలకలము ]

గజ— [ఎదుటఁ జూచి] ఏ మా యలజడి! అటు చూడుఁడు. మన భటుఁ డా పాత్ర ముతో నిట్యేడకే వచ్చుచున్నాఁడు!

భటుఁడు—[ప్రవేశించి, నమస్కరించి] దేవా! రాయలవారి చారులు మాయవేషము లతోఁ బాత్రులకడకు ఏవో కొన్ని పెట్టెలను జాబును దీసికొని పోవుచుండఁగాఁ బట్టి ఈ జాబును లాగికొని తెచ్చితిని. దేవర చిత్తగింతురుగాక!

(జాబు నిచ్చును)

గజ— అమాత్యశేఖరా! అం దేమి వ్రాయఁబడియున్నదో చదువుఁడు.

ఈశ్వ— చిత్తము (జాబు నందుకొని, విప్పి చదువును)

"శ్రీకృష్ణదేవరాయసార్వభౌముఁడు గజపతిమహారాజు సామంతు లగు పదునార్గురు పాత్రులకు సాదరంబుగా వ్రాయునది యే మనఁగా.— లోగడ మీరు మాకు వ్రాసినచొప్పున మీ కోరిన షరతుల కంగీకరించి, యిందుతో మీకుఁ బ్రకృతము ధనకనకవస్త్రాభరణాదులను బంపుచున్నాము. వీనిం గైకొని, మీరు వాగ్దానము చేసినచొప్పున నేఁడే గ...జ...ప...తి...ని...

[చదువుటకు సందేహించును]

గజ— చదువుఁడు. అది పరుఁ డన్న మాట గదా!

ఈశ్వ— [మరలఁ జదువును]

......మీరు వాగ్దానము చేసినచొప్పున నేఁడే గజపతిని బట్టి తెచ్చి మా కర్పించునది.

ఇట్లు మీ మిత్త్రుఁడు,
శ్రీకృష్ణదేవరాయసార్వభౌముఁడు.

గజ— (ఆశ్చర్యముతో) ఏమి యీ వైపరీత్యము! (భటునితో) పెట్టెలలో నే మున్నదో చూచితివా?

భటు— చిత్తము. గొన్ని యమూల్యాభరణములును, చీనిచీనాంబరములును, గొంత ధనము నున్నది ప్రభూ!

గజ— సరే నీవు పొమ్ము.

[భటుఁడు నిష్క్రమించును]

గజ—ఎంత ద్రోహ మొనర్చినారు పాత్రులు! అపాత్రులు! వారే యిట్లయిన నింక సుల్తానుల మాట చెప్పవలయునా?

ఈశ్వ— ఇది యంతయుఁ దిమ్మరుసుమంత్రి ప్రజ్ఞావిశేషమే యైయుండును.

గజ— భట్టారకా! మన కిపుడు కర్తవ్యము?

ఈశ్వ—(సాలోచనముగా) ప్రకృతము మనము దూరముగాఁ దొలఁగి కొంతకాల మరణ్యప్రాంతమునఁ దలదాఁచుకొనుటయే మంచిదేమో!

గజ—(తల పంకించి నిర్వేదముతో) అహో యెట్టివాని కెట్టి గతి పట్టినది!

శా. పాత్రుల్ పాత్రులె యంచు మిత్రులనుచున్ భావించితిం గాని, ధీ
మిత్రద్రోహులటం చెఱుంగనయితిన్, మేలాయె! నిం కెట్టులీ
శత్రువ్రాతము గెల్వ నేర్తు నడియాసల్ గాక? నేఁ డెట్టులో
మైత్రీచాతురిఁ జూపి రాయలను సంబంధించు టే శ్రేయమౌ.

ఈశ్వ— ఇదియు మంచి యోజనయే. కాని, యువరాజుగా రిందుల కియ్యకొందురని తోఁచదు.

గజ— ఆతనితో నేమి? నిష్ఫలాశయములకు నుప్పొంగు తన యకారణోద్రేకము నుపశమింపఁ జేసికొనుట కాతని కింకను రాజ్యానుభవము లేదు. కానీ, తిమ్మరుసుమంత్రికే కబురంపెదను.

భటుఁడు—(ప్రవేశించి, నమస్కరించి) దేవా! తిమ్మరుసుమంత్రిగారు తమ దర్శనార్థము వచ్చియున్నారు.

గజ—[ఆశ్చర్యముతో] తిమ్మరుసుమంత్రియా?

భటు— అవును ప్రభూ!

గజ—(భటునితో) సరే, సత్వరము లోనికిఁ బ్రవేశపెట్టుము.

భటుఁడు— చిత్తము,

[నిష్క్రమించును]

గజ— ఇం దేదో విశేష మున్నది!

ఈశ్వ— మనతో మైత్త్రి ఘటింపఁ జేసికొనుటకే యైయుండును,

[ ప్రవేశము — తిమ్మరుసు ]

గజ— (లేచి) తిమ్మరుసుమంత్రిపుంగవుల కభివాదనములు.

తిమ్మ— శుభప్రాప్తి రస్తు!

గజ— (ఆసనమును జూపును)

తిమ్మ— (కూర్చుండును)

గజ— మీ రాక కేదో మహత్తరకారణము.

తిమ్మ— కలదు...మహారాజా!...నాదొక...మనవి.

గజ— మాతోనా?

తిమ్మ— అవును.

గజ— ఏ మది?

తిమ్మ— సమానసంపత్కులయశోవిరాజితులగు ఆంధ్రకళింగాధీశ్వరులు తమలోం దా మిట్లు కలహించుట యెంతయు శోచనీయముగా నున్నది.

గజ— ఇందు శోచనీయ మేమున్నది? సామ్రాజ్యకాంక్ష రాజధర్మమే కదా!

తిమ్మ— అగుం గాక, దేని కైనను మేర యున్నది గదా!

గజ— ఇందు మేర మీఱినవా రెవరు?

తిమ్మ— ఎవ రైన నేమి? పరిసరసామ్రాజ్యాధీశ్వరులగు మీ రుభయులును క్షీరనీరన్యాయముగాఁ గలిసిమెలసి యుండిన నిరుపక్షములకును శ్రేయస్కరము గదా! మఱి యితరరాజు లెవ్వరేనియు మిమ్ముఁ దేఱిచూడఁ గలరా?

గజ— అటు లయిన మీ రాయలు మాయెడఁ జూపు ధిక్కారమును సైరింపు మందురా?

తిమ్మ— ధిక్కారమా? సమర మొల్లక యే కదా నాఁడు రాయలు సంధికై మీకు రాయబార మంపినది! అదియు ధిక్కారమే యందురా?

గజ— ఆ సంధిసందేశ మెట్టిదో మీకు మాత్రము తెలియదా?

తిమ్మ— పోనిండు, అయిన దేమో యైనది. ఇఁకనుండియేని మీ రిరువురును ఆప్తబాంధవులట్లు వర్తించుట......

గజ— (ఆశ్చర్యముతో) ఆప్తబాంధవులట్లు? (నవ్వి) ఆర్యా! యిది పొసంగని మాట.

తిమ్మ— మీ కా సందేహము వలదు. ఈ విషయమున రాయలను ఒప్పించు భారము నాది. లేకున్న మీకడ కరుదెంతునా ?

గజ— (సాలోచనముగాఁ దల పంకించి) దానికి విధానము ?

తిమ్మ— మీకుఁ దెలియని దే మున్నది? మీ రిరువురును గలిసి యేకకుటుంబముగా నేర్పడుటయే యద్దానికిఁ దగిన విధానము.

గజ— ఏకకుటుంబముగా ?

తిమ్మ— అవును.

గజ— ఎట్లు ?

తిమ్మ— రాయల వయోరూపగుణాదులు మీ రెఱింగినవే కదా !

గజ— అయిన ?

తిమ్మ— మఱి మీకును......యుక్తవయస్క యగు......పుత్రిక......

గజ— రాయలమీఁది పక్షపాతమున మీ రిట్లు......

తిమ్మ— కాదు, పక్షపాత మెన్నఁటికిని గాదు. త్రికరణశుద్ధిగా మీ యుభయుల శ్రేయస్సును గోరియే యీ విషయము మీతోఁ బ్రస్తావింప వచ్చితిని.

ఇట్టి సంబంధములు చరిత్రయందు అపూర్వములును గావు. చోళచాళుక్య రాజులు అన్యోన్యబాంధవమున నెట్లు వర్ధిల్లిరో మీ రెఱుంగనిది కాదు గదా అట్లే మీ రుభయులును గయ్యము మాని, వియ్యమున నేకమై వర్ధిల్లఁ జూచుటయే నా యభిలాష. ఇందు నన్ను అన్యథా భావింపకుఁడు.

గజ— (తనలో) ఈతఁడు నే ననుకొన్న మార్గమునకే వచ్చినాఁడు. ఇపు డింతకన్న గత్యంతరము లేదు. (ప్రకాశముగా) కాని, మా వీరభద్రునితో...ఈవిషయమై...

తిమ్మ— ఆతని దే మున్నది ? మీరు సర్వతంత్రస్వతంత్రులు!

గజ— మఱి మా అమ్మాయి యభీష్ట మెట్టిదో...

తిమ్మ— అట్లే కానిండు. కాని, యదియు అన్యథా యుండఁబో దనియే నా నమ్మకము.

గజ— సరే, ఆలోచింతము.

తిమ్మ— సెలవు.

గజ— మంచిది.

(తిమ్మరుసు నిష్క్రమించును)

గజ— అమాత్యశేఖరా! చూచితిరా ఎట్టి సంఘటనము తటస్థించినదో! మన కిపు డింతకన్న గత్యంతర మేమి యున్నది?

ఈశ్వ— ఇది కేవలము దైవసంఘటనమే. కాకున్న నిట్టి దెన్నఁడైనను జరుగు నని యనుకొంటిమా? పోనిండు, ఆంధ్రకళింగసామ్రాజ్యములు రెంటికిని ఇది శ్రేయోదాయకమే యగును.

గజ— మీ రింక తత్క్షణమే వివాహసన్నాహము గావింపుఁడు.

ఈశ్వ— చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు)

---

# 9 వ. రంగము — గజపతి యుద్యానవనము

[ప్రవేశము — అన్నపూర్ణ]

అన్న— (పట్టరాని యానందముతో)

(6) గేయము

మాధు— (ప్రవేశించి) సఖీ! ఈ సమయమున నీ విట్లు వనవిహార మొనర్చుచుండిన నెట్లు? సుముహూర్తము సమీపించిన దఁట! తండ్రిగారు నిన్నుఁ బిలుచుకొని ర మ్మన్నారు.

అన్న— మాధురీ! నేఁడు కదా నీ మూలమున నా నోము ఫలించినది, నా జన్మము ధన్య మైనది! నీ ఋణ మెట్లు తీర్చుకొందునే?

మాధు— బాగుగా నున్నది! ఇందు నేఁ జేసిన దే మున్నది? తిమ్మరుసయ్యవారి ప్రజ్ఞావిశేషమే దీని కంతకును గారణము. సరేకాని, సఖీ! ఆ విద్యానగరము కన్నులపండువగా నుండు నఁట, మఱి నన్నుఁగూడ నీతో......

అన్న— అ దేమే య ట్లనుచున్నావు? సరిసరి, నీవు రాకుండఁ బ్రయాణమా? రమ్ము పోదము,

(ఇరువురు నిష్క్రమింతురు)

# 10 వ. రంగము గజపతి భవనమందలి వివాహమండపము

[ ప్రవేశము — వీరభద్రగజపతి ]

వీర— (నలువైపులు పాఱఁజూచి, ఆశ్చర్యముతో) ఈ పందిళ్లేమి ? ఈ తోరణములేమి ? యుద్ధసమయమున నిట్టి వైభవమునకుఁ గారణ మేమో! (బిగ్గరగా) ఎవ రక్కడ ?

[ ప్రవేశము — దాసి చండిక ]

చండి— (నమస్కరించి) ఏం బాబూ !

వీర— చండికా ! ఈ యలంకారము లన్నియు నెందులకు ?

చండి— పెళ్ళి గాదు మఱి !

వీర— (ఆశ్చర్యముతో) పెండ్లియా ?

చండి— అవును బాబూ !

వీర— ఎవరికి ?

చండి— ఎవరికేమిటి ? అమ్మాయిగారికే.

వీర— అన్నపూర్ణకా ?

చండి— అవును బాబూ ! మీకుఁ దెలియదా ?

వీర— తెలిసిన నడుగుట యెందుకు ?

చండి— సిత్రంగా వుందే !

వీర— (ఆలోచనతో) చిత్రము కాదు, ఏదో తంత్రమే......సరే కాని, ఎవరి కిచ్చి?

చండి— రాయలవారికి.

వీర— (అదరిపడి) ఆఁ ! రాయలకే ?

చండి— సిత్తం.

వీర— ఎవరు నిశ్చయించిరో ?

చండి— తిమ్మరుసయ్యవారే స్వయంగా వచ్చి యేలినవారితో ఏమేమో మాట్లాడారఁట. అందుపై పెళ్ళి నిశ్చయించి, యీ యేర్పాట్లన్నీ చేశారు. అయ్యగారు తలుసుకొంటే యెంత ?

వీర— (క్రోపముతోఁ దనలో) ఎంతలో నెంత జరిగినది! ఔరా! తిమ్మరుసుమంత్రి ఎంతటి మేధావి! కాదు కాదు, ఎంతటి మాయావి!! కాకున్న నేను యుద్ధ రంగమునుండి వచ్చులోపలనే ఏవో కల్లబొల్లిమాటలు చెప్పి నా తండ్రి నిట్లు వంచింపఁ జాలునా?

ఆ తిమ్మరుసు వంచించె నన నేల? వంచింపఁబడుటకు మా తండ్రి మాత్ర మేమంత రాజ్యతంత్ర మెఱుంగని బాలుఁడా? భీరుఁడా? ఇది మనఃపూర్వకముగాఁ గావించిన పనియే. ఇందు నేనే మా తండ్రిచే వంచింపఁబడితిని.

ఆ మంత్రిహతకుఁ డేమో ప్రతిభాశాలి యని ఆదినుండియు మా తండ్రికి ఆతని పట్ల గౌరవమే. లేకున్న ఈ యుద్ధసమయమున మా రాజభవనమును బ్రవేశించుటకు ఆ కుటిలశాత్రవునకు గుండె లుండునా? ఈ ముప్పున కంతటికి అదియే మూల కారణము.

ఈ హేయకార్యమునకు నేను సమ్మతింప ననియే కదా నాకుఁ దెలుపకుండ, నన్ను వంచించి, నే వచ్చులోపలనే, కొంప మునిఁగిపోయినట్లు మా తండ్రి యీ సన్నాహము గావించెను! హుఁ! తనకు ఈనాఁటికిఁ బుత్రుఁడే శత్రు వై, శత్రువే మిత్త్రుఁ డాయెఁ గా! ఏమి కాలవైపరీత్యము!

ఆ గర్భశాత్రవునిఁ జెట్టపట్టుటకు సోదరి యెట్లియ్యకొనెనో! వీరాధివీరుఁ డగు తండ్రియే యిట్లయినపుడు ఇంక సోదరి ననుకొనుట యెందుకు?

దిగంతవిశ్రాంతయశోవిభూషితులగు గజపతులకు నేఁటి కెంతటి తలవంపు ఘటిల్లినది! దుర్భరము! దుర్భరము!!

శా. ఔరా! యెంత నికృష్టకార్యమిది!! జన్మారాతితో వియ్యమా?
శూరత్వంబును గంగఁ గల్పి, సకలరాజుల్ నవ్వ, సద్వంశవి
స్ఫారోదారయశోలతన్ జెఱుతురే? చాల్చాలు, ఈ పెండ్లియుద్
ఘోరంటంబును మంటఁ గల్పని యెడన్ నే వీరభద్రుండనే?

(పరిక్రమించి, యించుక యోజించి)

ఇనుమును బట్టి యగ్నికి సమ్మెటపోటు లన్నట్లు ఆ దుష్టశాత్రవుఁ డగు రాయల మూలమున నా సోదరి యెడలఁ గూడఁ గాఠిన్యమును వహింపవలసిన వాఁడ నైతిని గదా! (తల పంకించి) హుఁ, సామ్రాజ్యసంకల్పమునకును

బంధుప్రీతికిని జాల దూరము. ఏమయినను సరే నా యీ నిశ్చయమునకు సోదరీప్రేమ బలి కావలసినదే. చండికా!

చండి— ఏం బాబూ?

వీర— నీవు నా కొక కార్యమున సాయపడవలసియున్నది.

చండి— అ దేదో సెప్పండి బాబయ్యా!

వీర— (చండిక చెవిలో నేమో చెప్పును)

చండి— (కనులు త్రిప్పుచు) సిత్తం సిత్తం అలాగే చేస్తా.

వీర— భద్రము సుమా!

చండి— నాకు చెప్పాలా బాబూ?

వీర— మంచిది.

[ఇరువురు నిష్క్రమింతురు]

## 11 వ. రంగము — తిమ్మరుసు మందిరము

[ప్రవేశము — తిమ్మరుసు]

తిమ్మ— ఎట్లో నేం డీ విపత్సముద్రమునుండి బయటం బడంగలిగితిమి. ఈ విజ్యముచే గర్భశత్రువగు గజపతి యాప్తవర్గములోనివాం డయ్యెను; పరరాజుల నిర్బంధమునం జిక్కి తపించుచున్న నా దేశమాతకు నా తెలుంగుతల్లికి దాస్య విముక్తియుం గలిగినది. ఇంక మా రాయలు నిష్కంటకముగా రాజ్య మేలి కొనవచ్చును.

(పరిక్రమించి సాలోచనముగా) కాని, వీరభద్రగజపతి యేమాత్రము నమ్మందగినవాండు కాండు. తేనె పూసిన కత్తి.

ఉ. నాఁటి పరాభవాగ్ని మది నాటె తపించెడు వీరభద్రుఁ డే
నాఁటికి నేరి కేమి ఘటనం బొనరించునొ క్రూరచిత్తుఁ డై?
నేఁటి వివాహవేళ గమనింపఁగఁ దన్ముఖలక్షణంబు, నా
కేటికొ సంశయం బొదవె; ఏ నిఁక నేమఱియుండఁ జెల్లునే?

ఆతఁ డెంతటి కైనను జాలినవాఁడే. తండ్రి వైఖరి వేఱు, కుమారుని వైఖరి వేఱు, (తల పంకించి) కానిమ్ము, ఈ రాత్రి రాయల శయనమందిరమునకు సమీపముననే జాగరూకుఁడ నై యుండెదను.

(నిష్క్రమించును)

# 12 వ. రంగము — రాయల శయనమందిరము.

[ రాయలు శయ్యపైఁ బరుండి యుండును ]

కృష్ణ— ఆహా! మా యప్పాజి యనుగ్రహమున నేఁడు కృతార్థుఁడ నైతిని గదా!

శా. వేరం బెల్ల నడంగి దంతివిభుతో వియ్యంబు చేకూరెఁ, బెం
పారం గైవస మయ్యె నింతట విశాలాంధ్రంబు సర్వంబు, దే
వేరింగాఁ గయికొంటిఁ గోరిన సతిన్ శ్రేయోవిధానంబు; నిం
డారెన్ సర్వమనోరథంబులును; భాగ్యం బన్న నాదే కదా!

(ఎదుటఁ జూచి) అదిగో నా యర్ధాంగలక్ష్మి వచ్చుచున్నది. నేను నిద్ర నటించి, యామె విలాసము నొకింత గమనించెదఁగాక. (కన్నులు మూసికొని యుండును)

[ ప్రవేశము — అన్నపూర్ణ ]

అన్న— (చూచి) ఏమిది, ఇట్టివేళ నాథున కప్పుడే నిద్ర పట్టినది! (కొండొకసేపు ఆఁగి, కూర్చుండి వీణ వాయించుచు గాన మొనర్చును)

(7) గేయము

కృష్ణ— (లేచి, వెనుకవైపుకుండి వచ్చి, కనులు మూయును)

అన్న— (లేచి, ఆనందము నభినయించును)

కృష్ణ— ప్రేయసీ! సహజసౌందర్యభూషితవగు నీకు ఈ మేని భూషణములు దివ్వెటీముందు దీపమువలెె నున్నవి సుమా!

అన్న— నాథా! ప్రేమమయు లగు మీ కట్లు కాన్పించుచున్నదేమో కాని......

కృష్ణ— ఆఁ! వలచి వలపించుకొన్న ప్రేమస్వరూపిణివి నీవు గాక!

తే. ఆజి వీరుల నెందఱనో జయించి
పేరు గన్నాఁడ వీరాధివీరుఁ డనుచు,
నను జయించితి వీవు విన్ననువుచేత
శీలకులరూపసంపదచే లతాంగి!

అన్న— జీవితేశ్వరా! ఆదినుండియు మా తండ్రి గావించిన యెగ్గులు గణింపక న న్నిట్లు అర్థాంగినిఁగా గ్రహించిన మీ ప్రణయముముందు నా దేపాటిది?

కృష్ణ—

తే. పొలఁతిరో! నాఁడు నీ చిత్రఫలకమందుఁ
గంటి భవదీయమోహనాకార మొకటె
మాయురే! దానిలో నింత హాయి నించు
నమృతహృదయంబు గల దంచు నరయ నైతి.

(అన్నపూర్ణ మీఁది కొఱగును; ఒడ్డాణమునుండి కత్తి జాఱి క్రిందఁ బడును; ఉభయులు నివ్వెఱపడుదురు)

కృష్ణ— (అదరిపడి) ఏమి యీ వైపరీత్యము! ఈ తరుణ మేమి? కృపాణధారణ మేమి? (తల పంకించి) తెలిసినది. ఇదియా తంత్రము?

ఓసీ గోముఖవ్యాఘ్రమా! ఇదియే కాఁబోలు మీ దేశాచారము! కుల సంప్రదాయము! ప్రణయదేవత వని భావించితినే కాని నా పాలిటికి మృత్యు దేవత వని యెఱుంగనైతినే! ఏమి నయగారములు! ఎట్టి ప్రణయసందేశము! హుఁ, బెబ్బులి కడుపున లేడిపిల్ల పుట్టునా మఱి?

అన్న— (మోకరించి) ప్రాణపతీ!

కృష్ణ— ఛీ భర్తృఘాతినీ! ఇట్టి మాయోపాయముచే నన్ను నిర్జింప నెంచిన నీ తండ్రికిని నీకును దగు శాస్తి యగునట్లు ఇదిగో యీ కరవాలముననే నీ శిరస్సు సహస్రశకలములు గావించెదను. (కత్తి నెత్తును.)

తిమ్మరుసు— (పటాక్షేపమునఁ బ్రవేశించి) శాంతింపుము! వత్సా! శాంతింపుము!

కృష్ణ— (ఆశ్చర్యముతో) అప్పాజీ! ఏ మిది యిట్టి వేళ నరుదెంచితిరి!

తిమ్మ— తెలిపెదను వత్సా. శాంతింపుము! స్త్రీహత్య మహాపాతకము గదా!

కృష్ణ— అప్పాజీ! దీనిని స్త్రీ యనుచున్నారా? నా ప్రాణములఁ దీయ నేతెంచిన నారీరూపమహామారి గాని!

అన్న— ప్రాణపతీ! దైవసాక్షిగా నే నేపాపము నెఱుంగను.

తిమ్మ— సత్యము. ఈమె వచించినది ముమ్మాటికి సత్యము.

కృష్ణ— అప్పాజీ!!

తిమ్మ— వత్సా! శాంతింపుము. నిజ మెప్పుడును నిలుకడమీఁదఁ గాని తెలియఁ జాలదు.

తే. నెమ్మనంబు ప్రశాంతిమై నెగడినపుడె
నిజము కల్లయు నరయఁగా నేర్చు నరుఁడు,
తేటనీటను గాక యుద్వేలజలధి
పీచికల లోనిరూపు గాన్పింపఁ గలదె!

కన్నతండ్రి యేమి, ఇంతటి దురంతమున కొడిగట్టి కన్నబిడ్డ కాఁపురమును గంగపా లొనరింప నెంచుట యేమి? ఈ విషయమున గజపతియు నిర్దోషియే.

కృష్ణ— అయిన నింక దోషి యెవరు?

తిమ్మ— అదియు నిపుడే తేలఁ గలదు.

(అన్నపూర్ణతో) బిడ్డా! ఈ రాత్రి నిన్నలంకరించినవా రెవరు?

అన్న— ఆర్యా! మా యన్న దాసి చండిక. నే నానందపారవశ్యమున నుండుటచే అది యేమి యలంకరించినదో కూడ నెఱుంగనైతిని.

తిమ్మ— వింటివా వత్సా? ఇపుడు స్పష్టమాయెను గదా ఆ వీరభద్రగజపతియే దీని కంతకును గారకుఁ డని! మొదటినుండియు నాతని ముఖవైఖరి నా కేమో యనుమానాస్పదముగానే యున్నది. అందులకే కదా నే నీ రాత్రి యప్రమత్తుఁడనై మీ శయనమందిరమునకు సమీపమున నుండుట!

కృష్ణ— (పశ్చాత్తాపముతో) దేవీ! నా యవివేకమును మన్నింపుము. అమాయిక వగు నిన్ను అనరాని మాట లని నీ మనసు నొప్పించితిని.

అన్న— జీవితేశ్వరా! అనుగ్రహింపఁబడితిని.

కృష్ణ— మన మిర్వురమును నేఁడు అప్పాజిచే అనుగ్రహింపఁబడితిమి. (తిమ్మరుసు దిక్కు మొగం బై) అప్పాజీ!

తే. కోపమున సాధ్వి యిల్లాలి గొంతుఁ గోసి
ఘోరనారకకూపానఁ గూల నున్న
నన్ను వారించి కాపాడినాఁడ విట్లు;
నీ ఋణం బెట్లు తీర్చుకోనేర్తు? తండ్రి!

( ఇరువురును తిమ్మరుసునకు నమస్కరింతురు )

తిమ్మ— శీఘ్ర మేవ సుపుత్రావాప్తి రస్తు! వత్సా! ఇంక నే నా దాసి చండికకుఁ దగు శాస్తి గావించెదను.

కృష్ణ— అవశ్యము.

(తిమ్మరుసు నిష్క్రమించును)

[ తెర పడును ]

## 13 వ. రంగము — విద్యానగరరాజవీథి

[ ప్రవేశము—రామావధానులు, పేరిశాస్త్రి, చెరియొక వైపుననుండి ]

పేరి— ఓహో రామావధానులుగారా?

రామా— ఓహోహో పేరిశాస్త్రిగారా? ఏమి బహుకాలదర్శనము!

పేరి— నే నీమధ్య ఊరిలో లేను. ఇప్పుడే వచ్చుచున్నాను.

రామా— అలాగు చెప్పండి. ఎందుకు రాలేదా యనుకొన్నాను.

పేరి— ఎక్కడకు?

రామా— మన రాయలవారి యాస్థానమున కండీ!

పేరి— ఎందుకు?

రామా— రాయలవారికిఁ గుమారుఁడు గలిగినాఁడు గాదు మఱి!

పేరి— అలాగా! ఎంత శుభవార్త! బ్రహ్మానందమైనది.

రామా— కాదు మఱి!

పేరి— పిల్లవానికిఁ బేరేమి పెట్టిరి?

రామా— రంగరాయలు.

పేరి— మీ రక్కడనుండియే వచ్చుచున్నా రన్నమాట!

రామా— అవును బాబూ అవును. శ్రీవారు చేసిన సన్మానాలే యి వన్నియు (అని, తన మూటవైపు చూపును)

పేరి— అక్కడి విశేషా లేమి?

రామా— పుత్రోత్సవసందర్భమున రాయలవారు శిల్పకళావిదులకుఁ గవిపండిత నటీనటగాయనీగాయకులకును గొప్ప గొప్ప సన్మానాలు చేసినారు.

పేరి— అది శ్రీవారి కెప్పుడు నున్నదే. అందులోఁ బుత్రోత్సవము గనుక మఱింత వైభవముతో జరిపియుందురు.

రామా— వైభవ మన్న వైభవమూ! ఆ ఆశుకవిత్వప్రదర్శనాలు, ఆ సమస్యాపూరణాలు, ఆ పాటకచేరీలు, ఆ సన్మానాలు, అబ్బా ఒక టేమిటి! చూచితీఱవలసినదే. తిమ్మరుసుమంత్రిశేఖరులకు నవరత్నఖచితమగు బంగారుతోడాలు రాయలవారు స్వయముగాఁ జేతులకుఁ దొడిగి ప్రత్యేకసన్మానము గావించినారు.

పేరి— మఱి అప్పాజిగారి చలువయేగా రాయలవారి యభ్యుదయమున కంతకుఁ గారణము!......అది సరే కాని, ఎంతసేపటికిని గళావిదులు, కవులు, పండితులు, గాయకులు—వీరి సంగతియే చెప్పెదరే! జ్యోతిషుకు లెవరును రాలేదా యేమి?

రామా— ఓహో మీరు జ్యోతిషుకులుగా మఱి! ఆమాట మఱచితిని. రా కేమి? ఎంతోమంది జ్యోతిశ్శాస్త్రవేత్తలు వచ్చినారు. రాయలవారి కుమారుని జాతకము చాల గొప్పగా నున్నదని యెంత ప్రశంసించినా రనుకొన్నారు! శ్రీవారు వారికిఁ గూడ గొప్ప సన్మానాలు చేసినారు.

పేరి— పిల్లవానిది అంత మంచి జాతక మన్నారే! ఎప్పుడు పుట్టినాఁడు పిల్లవాఁడు?

రామా— నేటికిఁ బదునొకండు దినములు. అనఁగాఁ బోయిన యమావాస్య మంగళవారము సాయంకాలము నాలుగుగంటల కఁట!

పేరి— (వ్రేళ్లు మడిచి లెక్కించి, తనలో) అమావాస్య...నాలుగు గంటలకు జననము ......లగ్నము మకర మైనది. శుక్రుఁడు ద్వాదశింట! కుజుఁ డేడింట! చంద్రుఁ డెనిమిదింట! రాహువు తొమ్మిదింట! లగ్నాధిపతి వ్యయము! (పెదవి విఱిచి) అన్నీ బాలారిష్టదోషాలే! అయినను నా కెందుకీ పిలువని పేరంటము?

రామా— ఏఁ, ఏదో దీర్ఘముగా ఆలోచించుచున్నారు! ఎట్లున్నది జాతకము?

పేరి— ఎట్లుండవలెనో అట్లున్నది. ఆస్థానజ్యోతిషులకంటె నా కేమి యెక్కువ తెలియును?

రామా— ఆఁ, ఎంతమాట! మీముందర వా రెంత? సమయానకు మీ రక్కడ లేక పోతిరే యని మే మందఱము ఎంత యనుకొన్నామో!

పేరి— మీ కందఱకు నాయందలి వాత్సల్య మట్టిది. వత్తునా మఱి?

రామా— మంచిది బాబూ (నిష్క్రమించును)

పేరి— నే నా సమయమున నక్కడ లేకపోవుటయే ఒకందుకు మే లయినది. రాయలవారు కుమారుని జాతకమునుగూర్చి నన్నుఁ బ్రశ్నించిన నేమి చెప్ప వలయును? మాయమాటలు చెప్పిన నే తప్పు ఉన్న దున్నట్లు చెప్పిన సంతోషింతురా? సన్మానింతురా?

(నిష్క్రమించును)

---

## 14 వ. రంగము — వీరభద్రుని మందిరము

[ప్రవేశము — వీరభద్రుఁడు]

వీర— ఔరా! ఆ తిమ్మరుసుమంత్రిహతకుఁడు నాపాలిటికి యమునివలె దాపరించినాఁడే! ఆతఁ డనిన రాయల కెంత గౌరవమో! లేకున్న శయన మందిరమునఁ దాను భార్యతో వినోదకేళిం దేలు సమయంబున నాతఁ డెట్లు ప్రవేశింపఁ గలుగును? పాపము! ఆ చండికను జిత్రవధ గావించినాఁడట!

(పరిక్రమించి) నేను రాయలను అన్నపూర్ణను ఎడఁబాపుటకై ప్రయత్నింప, ఆ పాపిమంత్రిమూలమున నది విఫల మగుటయే కాక, వారికిఁ బుత్త్రిడు గూడఁ గలిగినాఁ డఁట! దుర్భరము! దుర్భరము!! ముం దా తిమ్మరుసును దెగటార్చినం గాని నా కసి తీఱదు.

శా. ఎట్టో తప్పినఁ దప్పెఁ గాక యలనాఁ, డేమాయె? భల్లూకపుం
బట్టుం బట్టితిఁ, బోవనిత్తునె యిఁకన్ బైలోక మేమైన? నే
నట్టే రాయల పుత్త్రుఁ జంపి, యది యా యప్పాజి కంఠానకున్
జుట్టంబెట్టి, దవాగ్ని రేఁపెద; దహించుం బో యదే వైరులన్

ఇంక నే నిట నుండరాదు. మాఱువేషమునఁ బోయి రాయలకుఁ బరమాప్తుఁడనుగా మెలఁగుచుఁ దరుణము వేచియుండి నా పని కొనసాగించెదను. (కొంచె మాలోచించి) కాదు కాదు, నే నటకుఁ బోవనే రాదు. నన్ను గుర్తింతు రేని, నాఁడు చండిక కయినదే నాకును గావచ్చును. కలఁడు గదా నా యంతరంగమిత్త్రుఁడు కరండకుఁడు! అతనినే యీ కార్యమునందు నియోగించెదను. ఇట్టి పనులయం దాతఁ డెంతయేని కుశలుఁడు. రాయలకుఁ బ్రియ మగునట్లు "మురహరుఁ" డను మాఱుపేరు పెట్టుకొని పోయి నా సంకల్పమును కొనసాగించుకొని రాగలఁడు.

(నిష్క్రమించును)

## 15 వ. రంగము — విద్యానగరరాజవీథి

[ప్రవేశము — పేరిశాస్త్రి, రామావధానులు, ఒకరి కొకరు ఎదురుగా

రామా — విధివిలాస మెంత విచిత్ర మైన దండీ శాస్త్రిగారూ!

పేరి — ఏ మా విచిత్రము అవధానులుగారూ?

రామా — ఇంతకు మీ చెవినిఁ బడలే దన్నమాట!

పేరి — అ దేదో చెప్పినఁ గదా!

రామా— గండ మండీ బాబూ గండము! జలగండము!!

పేరి— (ఆత్రముతో) ఎవరికి?

రామా— ఎవరికో అయిన నిం తెందుకు?

పేరి— అబ్బా! చంపక చెప్పండి యెవరికో.

రామా— మన రాయలవారి పుత్రునకే నండి!

పేరి— ఆఁ! రాయలవారి పుత్రునకే! అయ్యో! ఎంతగ్రహచారము!! అంతః పురములో నుండు కుఱ్ఱవానికి జలగండ మెట్లు సంభవించిన దండీ?

రామా— ఆఁ, పుర మేమి, అంతఃపుర మేమి? ఆ తరుణము వచ్చుసరికి......

పేరి— అసలుసంగతి వదలి యేమేమో............

రామా— వినండి మఱి. రాజభవనము పెరటిలోని సరస్సునొడ్డునఁ బిల్లవాఁడు బంతియాట యాడుకొనుచున్నాఁడట! ఆ యాటలో బంతి యెగిరి యా సరస్సులోఁ బడిన దఁట!

పేరి— దాసీజన మే మయినది?

రామా— అక్కడనే యున్నారు. వద్దు నాయనా యని వారు కేకలు పెట్టుచున్నను వినక — పసివాఁడు కాదు మఱి — ఆటతమకములో వారి కందకుండఁ బరుగెత్తి ఆ బంతిని తీయఁ బోవుసరికి — ఇం కే మున్నది — జాఱి ఆ సర స్సులోఁ బడిపోయినాఁ డఁట! ————

పేరి— (చెవులు మూసికొని) నారాయణ! నారాయణ!!

రామా— విచారపడకండి. ఇంతకు గండము తప్పినదిలెండి.

పేరి— అబ్బా! ఎంత కలవరపెట్టినా రండీ మనస్సును!!

రామా— అందుకే విధివిలాస మన్నాను.

పేరి— సరే కాని, గండ మెట్లు తప్పినది?

రామా— దైవమువలననే.

పేరి— ఏ మాటయు సూటిగాఁ జెప్పరు గదా!

రామా— దైవమే ఆ మురహరుని రూపాన వచ్చి కాపాడినాఁ డండీ!

పేరి— మురహరుఁ డెవఁడు?

రామా—— ఎక్కడనుండియో వచ్చి యిటీవలనే రాయలవారి కొలువులోఁ జేరిన సేవకుఁ డఁట! ఏదో పనిమీఁద ఆవేళకే ఆతఁ డక్కడకు వచ్చి, ఆ సంఘటనముఁ జూచి, గుభాలున సరస్సులోఁ దూఁకి పిల్లవానిని బైకిఁ దీసి రక్షించినాఁ డఁట!

పేరి—— ఎంతటి పుణ్యజనుఁడు! నిజముగా దైవమే కుఱ్ఱవానికై వాని నట్లు పంపి యుండును.

రామా—— సందేహమా ?

పేరి—— పోనిండు, ఇంతకు గండము గడచి కుఱ్ఱవాఁడు బయటఁ బడినాఁడు. అదే అందఱకుఁ గావలసినది.

రామా—— ఆయుష్యము గట్టిదైన గండా లేమి చేయు నండీ ?

పేరి—— అంతే లెండి ?

రామా—— మీ రేదో పనిమీఁదఁ బోవుచున్నట్టున్నారు ?

పేరి—— అవును, అవసరమైన పని యుండి.

రామా—— సరే పొండు!

(ఇరువురు నిష్క్రమింతురు)

# 16 వ. రంగము — రాయల మందిరము

[రాయలు కూర్చుండి యుండును]

కృష్ణ—— ఆహా ఏమి యా మురహారుని ప్రభుభక్తి! వినయసంపత్తి! సేవకుఁ డనిన నట్లు గదా యుండవలెను! మా రంగఁ డనిన నాతని కెంత ప్రేమ! ఒక్క నిముసమైనను వానినిఁ గ్రిందకు దింపఁడే! నిన్నటి జలగండమునుండి యాతఁడు తప్పింపకున్నఁ గుఱ్ఱవాఁ డేమైయుండెడివాఁడో! ఇంతకు ఆ నారాయణుఁడే యీ మురహారుని రూపమున వచ్చి కుఱ్ఱవానిని సంరక్షించియుండును. ఇంతటి గండము గడచి సుఖమై యున్నందున నింకఁ జిరంజీవిని బట్టాభిషిక్తుని గావించి, ఆ వేడుకఁ జూచి యానందింప నభిలాష పొడముచున్నది.

[ప్రవేశము — మురహరుఁడు]

ముర— (వంగి వంగి) ప్రభూ! నమస్కారము.

కృష్ణ— వచ్చితివా మురహరా! కూర్చుండుము.

ముర— (కూర్చుండి) ప్రభువులు ఏదియో యోజించుచున్నట్టున్నారు!

కృష్ణ—మా రంగనికిఁ బట్టాభిషేకముఁ జేయ సంకల్పము గలుగుచున్నది మురహరా!

ముర— (సంతోషమును నటించుచు) పట్టాభిషేకమా అబ్బాయిగారికి?

కృష్ణ— అవును మురహరా!

ముర— ఆహా! నేఁ డెంత సుదినము ప్రభూ! మా చిట్టి రంగయ్యతండ్రి సింహాసన మలంకరించినపుడు గదా మనకు బ్రహ్మానందము! మఱి శుభముహూర్త మెప్పు డని నిర్ణయించినారు ప్రభూ?

కృష్ణ—ఇదిగో అప్పాజితో సంప్రతించి నిర్ణయించెదను. నీవు పోయి అప్పాజి నొకమాఱిటకు రమ్మంటి నని చెప్పుము.

ముర— చిత్తము (పోవుచుఁ దనలో) రాయలను నా వలలోఁ బడవేసికొనుట కిదియే మంచి తరుణము. (నిష్క్రమించును)

కృష్ణ— ఈ మురహరుఁ డెంత యోగ్యుఁడో! మా రంగనికిఁ బట్టాభిషేక మనినఁ దనకుఁ బట్టాభిషేక మైనట్టే పొంగిపోవుచున్నాడు. ఇంతటి విశ్వాసపాత్రుఁడు లభించుట నిజముగా అదృష్టము గదా!

[ప్రవేశము — తిమ్మరుసు]

ముర— (పొంచియుండి వారి యుభయుల సంభాషణమును వినుచుండును)

కృష్ణ— (లేచి నమస్కరించును)

తిమ్మ— మనోఽభీష్టసిద్ధి రస్తు!

కృష్ణ— (సంతోషముతో) మీ యాశీర్వాదము నా సంకల్పమునకు నాందియే సుఁడీ!

తిమ్మ— నీ సంకల్ప మెయ్యది వత్సా?

కృష్ణ— మన రంగనికిఁ బట్టాభిషేకమును జేయ సంకల్పించితి నప్పాజీ!

తిమ్మ— పట్టాభిషేకమా?

కృష్ణ— అవు నప్పాజీ! ఏ మట్లన్నారు?

తిమ్మ— (నవ్వి) ఇంత పసితనమునఁ జిరంజీవినిఁ బట్టాభిషిక్తునిఁ గావించుటకు నీ వేమంత ముసలివాఁడ వైతివి? వయసు చెల్లిన నావంటివానికిఁ గలుగవలసిన సంకల్పము నీకుఁ గలిగినదే!

కృష్ణ— పసితన మైన నేమి? పేరునకుఁ గుఱ్ఱవాఁడు రాజైనను, రాజ్యభారమును వహించువారము మనమే కదా అప్పాజీ!

తిమ్మ— అది వాస్తవమే. కాని, యీ విషయమున బ్రజ లేమని భావింతురో మఱి!

కృష్ణ— ఇందుఁ బ్రజల కేమి నిమిత్తము? నా కుమారుని పట్టాభిషేకమును నిర్ణయించువారు ప్రజలా?

తిమ్మ— నిర్ణయించువా రని కాదు...కాని సామ్రాజ్య మనినఁ బ్రజలు గాక మ ఱెవ్వరు? ప్రజాభిప్రాయమునుగూడఁ బాటించుట పురోభివృద్ధికి మార్గము గాదా మఱి!

కృష్ణ— అటు లైన నా కుమారునిఁ బట్టాభిషిక్తునిఁ గావించుట కైనను నాకు స్వాతంత్ర్యము లే దన్నమాట!

తిమ్మ— అయ్యో! లే కేమి వత్సా! అది గాదు నే నన్నది. ప్రజానురక్తియే రాజునకు బలము గావున, ఈ విషయమున దూరాలోచన చేయవలసియుండు నని.

కృష్ణ— పోనిండు, ఇందుఁ బ్రజానురక్తికి భంగకర మైన దే మున్నది?

తిమ్మ— భంగకర మని కాదు నే ననుట.

ఋ మఱి మీ సంకోచమునకుఁ గారణము?

తిమ్మ— మీ వంశమున ఈవఱకు నేనాఁడును లేని యీ నూతన విధానమువలనఁ బ్రజల కెట్టి తలంపు గలుగునో యని నా సంకోచము. అంతే.

కృష్ణ—అటు లైన మా యన్నమాత్రము తన కుమారుని ఎనిమిదవయేటనే పట్టాభిషిక్తునిఁ గావింపఁ దలంపలేదా?

తిమ్మ— అది నెఱవేఱినదా మఱి? యుక్తవయస్కుఁడ వగు నీ వుండఁగాఁ బసివాఁడు తగఁ డనియే కదా నాఁడు నిన్నుఁ బట్టాభిషిక్తునిఁ గావించితిని! అది గాక, ఆ సందర్భము వేఱు వత్సా!

కృష్ణ— మఱి యీ సందర్భమును వేఱే.

తిమ్మ— ఎటు?

కృష్ణ— ఆదినుండియు నా యభ్యుదయమున కంతకును మీరే కదా కారకు లప్పాజీ! నావలెనే కుమారుఁడును మీచే నభిషిక్తుఁ డైనచో మహోన్నతికి రాఁగల డని నా యాశయము.

మఱి మీకా వార్ధకము పైకొన్నది. ఇపు డన్ననో చిరంజీవి పట్టాభిషేకో త్సవమును జూచి మీరును ఆనందింపఁ గలుగుదురు. దీనికిఁ బ్రజలుమాత్ర మేల యంగీకరింపరు? ఎందు కామోదింపరు?

తిమ్మ— (చిఱునవ్వు నవ్వి) అదియా నీ యాశయము! (కొంచె మాలోచించి) శుభము. అట్లే కానిమ్ము, నీ యభిలాషయే నా యభిలాషయు.

కృష్ణ— మఱి మీ రింక శుభముహూర్తమును నిర్ణయించి, పట్టాభిషేకమునకు వలయు సన్నాహము లొనర్పుఁడు.

తిమ్మ— అవశ్య మట్లే యొనర్చెదను. నీ వీలోపలఁ గళింగమున కాహ్వానపత్రిక నంపుము.

కృ— ఆలాగే.

తిమ్మ— (నిష్క్రమించును)

కృష్ణ— (తనలో) ఏ మిది! కుమారుని పట్టాభిషేక మనిన నెంతో యానందింప వలసిన యప్పాజి......నే డిట్లు......విముఖతఁ జూపుట కేమి హేతువో! నే నింతగా నచ్చఁ జెప్పి యొప్పింపవలసివచ్చెనే!

మురహరుఁడు— (చాటుననుండి యీవలకు వచ్చి, తనలో) నా పాచిక పాఱుట కిదియే మంచి తరుణము. (ప్రకాశముగా) ప్రభూ! శుభముహూర్త మెప్పు డని నిశ్చయించినారు అప్పాజిగారు?

కృష్ణ— (విసువుతో) నీ వొకఁడవు వెఱ్ఱివాఁడవు.

ముర— (బిక్కమొగముతో) ఏమి ప్రభూ అట్లనుచున్నారు? అప్పాజిగా రేమైన అభ్యంతరము చెప్పిరా?

కృష్ణ— అభ్యంతరము గాదు. ఇంత పసితనమునఁ గుమారునిఁ బట్టాభిషిక్తునిఁ గావించినచోఁ బ్రజ లేమని భావింతురో యని ఆయన సంకోచము.

ముర— సంకోచమా? అట్లయిన, మనుమని పట్టాభిషేకోత్సవమును జూడ నుత్స హించి అప్పాజిగారే యిట్లు సంకల్పించినా రని ప్రకటింపుఁడు. అపుడు ప్రజ లందఱు తప్పక జోహా రొనర్చితీరుదురుగా!

కృష్ణ— (సాలోచనముగాఁ దల పంకించుచు) అవును, అప్పాజియందుఁ బ్రజల కట్టి భక్తివిశ్వాసములే కలవు.

మురః— అప్పాజిగారి కుమారునివలె అబ్బాయిగారు గూడ ఇప్పుడే యుక్తవయస్కుఁడు గావలెనన్న నేలాగు మఱి? అయినను..—తగినంత కారణము లేనిదే.....అప్పాజిగారు...ఏదియు ననరు. వారి హృదయ మతిగూఢము. వెఱ్ఱిబాగులవాఁడను నా కేమి తెలియును? అదంతయుఁ దమకే తెలియవలె మఱి.

కృష్ణ— (తల పంకించుచు, నేదియో దీర్ఘాలోచన చేయుచుండును)

ముర— ప్రభువు లేదో......ఆలోచనలో నున్న ట్లున్నారు. నే నింకఁ బోయెదను.

కృష్ణ— ఏమియు లేదు. కూర్చుండుము.

ముర— ఇంతకు మఱి శుభముహూర్తమును నిర్ణయించినారా ప్రభూ?

కృష్ణ— ఆ, నిర్ణయించినట్లే.

ముర— నట్టనుచున్నారే?

కృష్ణ— జ్యోతిషులతో సంప్రతించి నిర్ణయించెద నన్నారు అప్పాజి.

ముర— (సంతోషమును నటించుచు) అమ్మయ్యా! ఇప్పటికిఁ గుదుటఁబడినది నా మనస్సు. ఇంక అప్పాజిగారి యింటికిఁ బోయి అబ్బాయిగారి కీ సంతోష వార్త చెప్పి వచ్చెదను.

కృష్ణ— ఏమీ, కుబ్జవాఁడు అప్పాజి యింట నున్నాఁడా?

ముర— అవును ప్రభూ!

కృష్ణ— ఎవరు తీసికొనిపోయిరి?

ముర— ఎవ రేల తీసికొనిపోవలెను ప్రభూ! వారు సర్వతంత్రస్వతంత్రులు.

కృష్ణ— అప్పాజియే తీసికొనిపోయెనా?

ముర— చిత్తము. అబ్బాయిగా రనిన అప్పాజిగారి కెంత వాత్సల్యమో! మఱి కొన్నాళ్ళనుండి వారు అబ్బాయిగారిని విడియుండుటయే లేదు.

కృష్ణ— మంచిది. కుబ్జవానితోఁ గూడ దేవినిఁ జూడఁ గోరుచున్నాను. మురహరా! నీవు పోయి కుబ్జవానినిఁ దీసికొని రమ్ము. నీ వేమియుఁ బట్టాభిషేకవార్తఁ దెలుప నక్కఱ లేదు.

ముర— చిత్త మట్లే. (పోవుచుఁ దనలో) తిమ్మరుసునెడల రాయల కనుమాన బీజమును నాటితిని. ఇంక నది మహావృక్షమై త్వరలోనే ఫలింపఁ గలదు.

(నిష్క్రమించును)

కృష్ణ— (పాలోచనుఁ డై యిటు నటు తిరుగుచు) ఈ మురహరుఁ డనినట్లు...... ప్రజల కందఱకు నాయందుకంటె అప్పాజియందే భక్తివిశ్వాసములు మెండు ... అప్పాజియుఁ బ్రజానురక్తినే యెక్కువగాఁ బాటించుచున్నాఁడు!... అటు ప్రజాభిప్రాయము! ఇటు అప్పాజి యంగీకారము!...... నా కింక స్వాతంత్ర్యమే లేదుగా!

మురహరుఁ డనినట్లు...తగినంత కారణము లేనిదే అప్పాజి యేదియు ననరు...ఆయన హృదయ మతిగూఢము... మా రంగఁడా పసివాఁడు... అప్పాజి కుమారుఁడా యుక్తవయస్కుఁడు, తండ్రివలెనే ప్రతిభాశాలి, సర్వ జనాదరపాత్రుఁడు!...అప్పాజియో సర్వతంత్రస్వతంత్రుఁడు!

కొన్నాళ్ళనుండి...ఏటికో మఱి......అప్పాజి ముఖమున...ఏమో ఆందోళనము పొడసూపుచున్నదే!

[ వీథిలో బిచ్చగాని పాట ]

(8) గే య ము

కృష్ణ— (పాట నాలించి, ఆశ్చర్యముతో) ఏమి యీ యుపశ్రుతి! (ఎడమ కన్ను అదరుట నటించి) ఏమిది నా యెడమకన్నేటికో అదరుచున్నదే! (గుండెలు తడవికొనుచు) ఛీ! ఊఱక నా కేటి కీ వ్యాకులత? పట్టాభిషేకసన్నాహ మును జూచుకోవలెను. ఓహో మఱచితిని, కళింగమున కాహ్వానపత్త్రిక నంపవలెను గదా!

(నిష్క్రమించును.)

## 17వ. రంగము—తిమ్మరుసు మందిరము.

[తిమ్మరుసు కామానాయకుఁడును గూర్చుండి యుందురు.]

కామా— ఆర్యా! ఆ మురహరుఁ డెవ్వఁ డై యుండు నని మీ యూహ?

తిమ్మ— ఆతని వైఖరిఁ బరికింపఁగా నెవ్వఁడో మాయావిగాఁ గన్పట్టుచున్నాఁడు.

కామా— మహారాజున కాతనియం దంత దృఢవిశ్వాస మెట్లు కలిగెనో?

తిమ్మ— అంత వినయవిధేయతలు చూపువానిపై విశ్వాసము కుదురుటలో ఆశ్చర్య మే మున్నది? అదిగాక, ఆతఁ డెంత మాయావియో రాయ లంత యమాయికుఁడు.

కామ— ఆతఁ డెంతటి మాయావి యైన నేమి? మన మింతమంది యుండఁగా ఆతఁ డేమి చేయఁగలఁడు?

తిమ్మ— ఎంత వెఱ్ఱివాడవు! త్రాఁచుపాముతోఁ జెలగాట మేనాఁటికేని యనర్థకమే కదా!

కామ— పోనీ యాతని విషయమై మనమే మహారాజుతో ఏల హెచ్చరింపరాదు?

తిమ్మ— హెచ్చరించుట కాతనియం దేమి దోషము బయలుపడిన దని? మొన్నఁటి జలగండమునుండి కుమారుని రక్షించినప్పటినుండి రాయల కాతఁడు మరీ యాంతరంగికుఁడుగా నేర్పడినాఁడు. ఆతనిపై నిఁక మాట పడనిచ్చునా రాయలు?

కామ— ఈ కపటవర్తనమువలన ఆతనికిఁ గలుగు ప్రయోజన మేమో?

తిమ్మ— ఇది యంతయు ఆ వీరభద్రుని దుస్తంత్ర మైయుండు నేమో యని తోఁచు చున్నది.

కామ— ఆతని దుస్తంత్ర మంతయు నాఁటిరాత్రి చండిక మూలమున బయలు పడనేపడినదిగా! ఇంకను సిగ్గు లేక యాతఁ డేమి తలపెట్టిన నేమి ఫలము?

తిమ్మ— అట్లు గాదు, ఆనాఁడు తన పన్నుగడ విఫల మైనది గావుననే మఱింకే దైనఁ బెద్దయెత్తు ఎత్తియుండవచ్చును. ఈ మురహరుని కూటమి తుద కేవిధముగాఁ బరిణమించునో యని నానాఁటికి నా యంతరాత్మ కేటికో చెప్ప రాని యాందోళనము కలుగుచున్నది.

కామ— అటు లయిన మన కిపుడు కర్తవ్యము?

తిమ్మ— ఏ మున్నది? జాగరూకుల మై యుండుటయే. అంతకన్న మన మిపుడు చేయఁదగిన దేమియు లేదు.

కామ— మహారాజు బుద్ధి నేఁ డిట్లు ఎందుకు అస్తవ్యస్త మైనదో?

తిమ్మ— ఇం దాశ్చర్య మే మున్నది?

తే. కానికాలంబు సంప్రాప్త మైననాఁడు
మాయలోఁ బడు నెంత ధీమంతుఁడేని;

కనకమృగరూపమునకు ముగ్ధతను జెంది
వంచితుఁడు కాఁడె జానకీవల్లభుండె!

కానీ దైవ మున్నాఁడు. పట్టాభిషేకసమయము సమీపించుచున్నది. వలయు సన్నాహము లొనర్పవలెను. రమ్ము పోదము.

(నిష్క్రమింతురు)

## 18 వ. రంగము — అన్నపూర్ణాదేవి మందిరము

[ప్రవేశము — అన్నపూర్ణ, కుమారుఁడు రంగరాయలు, చెలికత్తె మాధురియు]

అన్న— (కుమారు నలంకరించుచు మెడలోఁ బులిగోరుపతకము వేయుచు)

(9) గేయము

మాధు— అమ్మా! చూడుము, ఇప్పు డచ్చముగఁ దండ్రివలెనే యున్నాఁడు!

రంగ— అమ్మా! నడుమునకుఁ గత్తి కట్టలేదేమే?

అన్న— ఇప్పు డెందులకు నాయనా? పెద్దవాఁడ వైనతర్వాతఁ గట్టుకొందువు గానిలే.

రంగ— ఎప్పుడు? నాన్నతోఁ గూడ యుద్ధానికి పోయేటప్పుడా?

అన్న— (ముద్దు పెట్టుకొని) ననుఁ గన్న తండ్రీ! నీ కిప్పటినుండియు యుద్ధప్రసంగము లెందు కోయీ?

మాధు— సింహముకడుపున జింకపిల్ల పుట్టునా మఱి?

[ప్రవేశము — రాయలు మురహరునితో]

మాధు— అమ్మా! అరుగో మహారాజుగారు!

అన్న— (సంతోషముతో నెదు రేఁగి) నాథా! ఇదిగో అప్పాజిగారి యాశీర్వాద ఫలము! (అని పిల్లవానిని రాయల చేతి కిచ్చును)

కృష్ణ— (ఎత్తుకొని ముద్దాడి) రంగా! నీ కొక మంచి మాట చెప్పనా?

రంగ— ఏం మాట నాన్నా ?

కృష్ణ— చెప్పు మంటావా ?

రంగ— చెప్పు మఱి !

కృష్ణ— నిన్నుఁ జూడటానికి మీ తాతయ్యా మామయ్యా వస్తున్నారు,

అన్న— (సంతోషముతో) నిజముగానా ?

రంగ— మామయ్యా ? ఇక్కడే యున్నాఁడుగా ?

కృష్ణ— ఎక్కడ ?

రంగ— ఇడుగో (అని, మురహారునిఁ జూపును)

కృష్ణ— ఈతని పేరు మామయ్యా యని పెట్టుకొన్నావా యేమి? బాగుగా నున్నది! (పిల్లవానిని మురహారుని చేతి కిచ్చును)

ముర— (సంతోషమును నటించుచు) రా నాయనా రా! అప్పాజిగారి ఆశీర్వాదఫలము !

కృష్ణ— మొన్నఁటి జలగండమునుండి రక్షించి కుఱ్ఱవానికి నీవు మఱి ప్రాణదాతవై తివిగా !

ముర— అదియు అప్పాజిగారి యాశీర్వాదఫలితమే !

అన్న— నాథా ! నిజముగా మా తండ్రి యిటకు వత్తు నని కబు రంపిరా ?

కృష్ణ—లేదు. నేనే వారి కాహ్వాన మంపితిని.

అన్న— ఎందుకు ?

కృష్ణ— మన రంగనికిఁ బట్టాభిషేకముఁ జేయ సంకల్పించి.

అన్న— (ఆశ్చర్యముతో) పట్టాభిషేకమా ?

కృష్ణ— ఏ మట్లు నివ్వెఱపడెదవు ?

అన్న— ఇంత చిఱుతప్రాయముననా ?

కృష్ణ— అయిన నేమి ?

అన్న— అప్పాజిగారితో సంప్రతించితిరా ?

కృష్ణ— వెఱ్ఱిదానా ! అప్పాజితో సంప్రతింపకయే నిర్ణయింతు ననుకొంటివా ? అప్పాజి మన పాలిటికిఁ బరమగురు గదా !

అన్న— (చెవులు మూసికొని) అమంగళము ప్రతిహత మగుఁ గాక! అమంగళము ప్రతిహత మగుఁ గాక!

కృష్ణ— దేవీ! ఏటి కిట్లు భీతిల్లెదవు?

అన్న— నాథా! అదేమో నేఁడు మీ నోట అమంగళవాక్యము వెలువడినది.

కృష్ణ— నే నిపు డేమన్నాను?

అన్న— అప్పాజీ మన పాలిటికిఁ బరమవైరి గదా యని యంటిరి.

కృష్ణ— కార్యభారముచే మనస్సు మనస్సులో లేనందున న ట్లంటిని గాఁబోలు! బేలా! దీని కింత కంగారా?

ముర— (తనలో) సెబాస్! నా మిత్త్రుఁడు వీరభద్రుని సంకల్పమున కిది యెంతయు శుభసూచన.

కృష్ణ— దేవీ! నీ కీ శుభవార్త దెలుపుటకే వచ్చితిని. మంత్రివర్గము నాకై యెదురు చూచుచుండును. నే నిఁకఁ బోవలెను.

ముర— (తనలో) ఈ రాత్రియే నా మిత్త్రుని సంకల్పము కొనసాగించెదఁ గాక!

కృష్ణ— మురహరా! రమ్ము పోవుదము.

ముర— చిత్తము.

(మురహరునితో రాయలు నిష్క్రమించును)

అన్న— (ఆనందముతోఁ గుమారుని దగ్గఱకుఁ దీసికొని)

(10) గేయము

మాధు— నాయనా! నీవు పట్టాభిషిక్తుఁడవైతే నాకే మిస్తావ్?

రంగ— నీ కేమి కావా లంటే యది.

అన్న— మఱి నాకో?

రంగ— నే నిచ్చే దేమిటే? అంతా నీదేగా!

అన్న— నా కన్నతండ్రీ!

(ముద్దాడుచు నిష్క్రమింతురు.)

---

## 19 వ. రంగము—అన్నపూర్ణాదేవి శయనమందిరము

[అన్నపూర్ణాదేవి శయ్యకుఁ బ్రక్క నుండు వేఱొక పాన్పుపైఁ గుమారుఁడు రంగరాయలు నిద్రించుచుండును. మురహారుఁడు నల్లని ముసుఁగు వేసికొని, బొడ్డులోఁ జిన్నకత్తితో బెదరుచూపులు చూచుచు వచ్చి, పిల్లవానిని ఎత్తుకొని పరుగిడి పోవును.]

(తెర పడును)

---

## 20 వ. రంగము — పేరిశాస్త్రి గృహము

[పేరిశాస్త్రి కూర్చుండి ఏదో జాతకముఁ బరిశీలించుచుండును]

పేరి— అబ్బా! యీ జ్యోతిషపువృత్తికంటెఁ బాడువృత్తి లేదు కదా! ఏవో పాడు జాతకాలు తెచ్చి యోగాలు చెప్పుమందురు. జాతకము బాగుగా నుండలేదనినఁ గష్టము తోఁచును; పోనీ బాగుగా నున్న దని చెప్పుదుమా, చెప్పినట్టు జరగకపోయినఁ బరిహాసింతురు; ఎటు చెప్పినను బాధయే.

(తెరలోఁ బెద్ద కలకలము)

(తెరలో) అయ్యో అయ్యో ఎంత ఘోరము! ఎంత దారుణము!!

పేరి— (ఆలకించి) ఏమది? పాపము ఎవరి కేమి మూడినదో! (ఎదుటఁ జూచి) జనులు గుంపులు గుంపులుగాఁ బరుగెత్తుచున్నారే!

రామావధానులు— (పరుగుపరుగున వచ్చి) అయ్యో అయ్యో! ఎంత ఘోరము! ఎంత దారుణము పేరిశాస్త్రిగారూ!

పేరి— (ఆత్రముతో) ఏమది రామావధాన్లుగారూ?

రామా— ఏమి చెప్పను? మన రాయలవారి కుమారుని ఎవరో యర్ధరాత్రమున హత్య గావించినారఁట! ఊరంతయు అట్టుడికినట్టు ఉడికిపోవుచున్నది.

పేరి— (అదరిపడి) ఆఁ ఆఁ హత్యయే? రాయలవారి కుమారునే? ఎంత మాట! పెళ్లుగాఁ బట్టాభిషేకము దలపెట్టఁగా ఈలా గయినదా? ఆ తేండ్లయినను నిండలేదు పాపము! ఎవ్వఁడో ఆ ఘాతకుఁడు?

రామా— ఎవ్వఁడైన నేమి ఇంత జరిగిన తర్వాత? దర్యాప్తు చేయుచున్నారఁట!

వేరి— పాప మెట్టి గ్రహచారమండి!

రామా— గ్రహచార మనఁగా జ్ఞాపకము వచ్చినది, శాస్త్రిగారూ! ఆనాఁడు నామకరణమప్పుడు జ్యోతిషు లందఱు పిల్లవాని జాతక మఖండముగా నున్నదని యెంత పొగడినారే! ఇ దేమి యీలాగున జరిగినది మఱి?

వేరి— అదేనండి యీ జ్యోతిషములో వచ్చిన చిక్కు. ఉన్న దున్నట్టు చెప్పిన నెవ్వరైనను సంతోషింతురా? అందులో మహారాజుగారి కుమారుని విషయమునఁ జెప్పుట యెట్లు? నేను ఆనాఁడే అనుకొన్నాను కుఱ్ఱవాఁడు దక్కఁడని. అయినను ఆ యశ్లీలము నే నెందు కనవలె నని యూరకున్నాను.

రామా— అవును మీ రప్పుడే ఏదో దీర్ఘముగా ఆలోచించి పెదవి విఱిచినారు. నాకు అంత యర్థమైనది గా దప్పుడు.

వేరి— మనము పోయి పాప మొకమాఱు చూచి వత్తము పదండి!

రామా— ఆలాగే. (నిష్క్రమింతురు)

---

## 21 వ. రంగము — తిమ్మరుసు మందిరము

[ ప్రవేశము — తిమ్మరుసు ]

తిమ్మ— (విచారముతో) అక్కటా! నే ననుమానించినట్లే యైనది. ఏనాఁ డా మురహరుఁ డిందుఁ గాలిడినాఁడో యానాఁడే నా గుండెలలో రాయి పడినది. ఈ ఘోరహత్యకు...అతఁడే కారకుఁ డైయుండవలెను. ఎంత యోజించినను...ఈ విషయమున నా మనస్సు ...ఏటికో యాతనిమీఁదికే పోవుచున్నది. కాని తగినంత నిదర్శన మేదియుఁ గనఁబడనప్పుడు నే నేలాగున నిరూపింపఁగలను?

(పరిక్రమించి) ఆహా కాలవైపరీత్యము! నాఁడు తిప్పాంబ విషముఁ బెట్టఁ జూచినపుడును, వీరనృసింహరాయలు కనులు దీయింప నెంచినపుడును రాయలను గాపాడఁ గలిగితినే కాని, ఈనాఁడు రాయల కుమారుని రక్షింపలేక పోతినే! పట్టాభిషేకమహోత్సవ మేమి! ఈ దారుణ మారణ మేమి! ఎంత

యోదార్చినను ఈ నూతనపుత్త్రశోకమువలనఁ బాపము ఆ దంపతుల కూఁ బట్టయే కలుగకున్నది. ఏమి చేయుదును ?

ఇంతకు ఈశ్వరేచ్ఛ బలీయము ! కానున్న, రాయల కా మురహారునియం దంత దృఢవిశ్వాస మేల కలుగవలెను ? ఏమి చెప్పఁ జూచినను అతనిపై మాట పడనీయఁడే ! ఒక్క క్షణ మైనను అతని వీడి యుండలేఁడే ! ... నా ప్రజ్ఞాబల మంతయుఁ గడకు ఆ మాయావిమూలమున నిరర్థక మైపోయినది గదా !

తే. కాలగతి యక్కటా ! ప్రతికూల మైన
సాగివచ్చునె నరుని ప్రజ్ఞాబలంబు ?
త్రిజగదారాధ్యుఁ డై మింటఁ దేజరిల్లు
రవియె నిస్తేజుఁ డౌఁ గాదె రాహువశత !

ఆ మాయావి యింకను ఏమి యనర్థములు తెచ్చిపెట్ట నున్నాఁడో ! ఎట్లయినను వాని నిటనుండి పాఱఁదోలకుండిన రాయలకేనియు క్షేమము లేదు. దీని కేదేని యుపాయ మాలోచించెదఁ గాక !

(నిష్క్రమించును)

# 22 వ. రంగము — అన్నపూర్ణాదేవి మందిరము

[ ప్రవేశము – అన్నపూర్ణ, మాధురి ]

అన్న— (దుఃఖముతోఁ బాన్పుపైఁ జేరఁబడి)

(11) గేయము

హా హతవిధీ ! ఎంతలో నెంత చేసితివి !

మాధు— అమ్మా ! ఊఱడిల్లుము. కడచినదానికై వగచి యేమి ఫలము ? ఇంతకుఁ గారణార్థ మి ట్లున్నది.

అన్న—

శా. అమ్మాఁడి్ాన్ నినుఁ బట్టి నట్టనడు రే యా పాపి హింసించుచో
"అమ్మా అయ్యో"యటంచుఁ జీరి యపు డెంత ల్లాడినావో కదా!
చుమ్మల్యా జెడు నాదుగర్భ మెటు సైఁచున్? నీదుపట్టాభిషే
క మ్మీరీతిగఁ దెల్లవాఱ విధికిన్ గన్ గుట్టనే పుత్త్రికా!

అంటినఁ గందిపోవు నీ కుసుమకోమల దేహము నట్లు హింసించుటకు ఆ పాపాత్ముని చేతు లెట్లాడెనో కదా! మందహాసచంద్రికలు గాయు నీ ముఖ చంద్రుని నే నిం కెన్నఁడు చూతునురా తండ్రీ;

మాధు— అమ్మా! అర్ధరాత్రమునఁ గూడ నిద్దుర లేకుండ నీ విట్లు విలపించుచుండిన నీ దేహమున కేమి యస్వస్థత గలుగునో! ఇంక లోనికి వచ్చి పరుండుము తల్లీ!

అన్న— రంగా రంగా! ఎక్కడ నున్నావురా తండ్రీ! రాజాధిరాజకుమారుఁడ వై పుట్టి కడ కెట్టి ఘోరదుర్మరణముపా లై తివిరా నాయనా!

మాధు— అయ్యో వెఱ్ఱితల్లీ! ఆయువు దీఱినప్పు డైశ్వర్య మేమి చేయఁగలదు?

అన్న—

తే. నిన్నగా కల మొన్న జన్మించినావు
ముద్దుముచ్చట లెవ్వియు ముగియ లేదు
ఎంత పాపంబురా తండ్రి! యింతలోనె
నీకు నూరేండ్లు నిండెను గా కుమార!

మాధు— అమ్మా! నీ విట్లూఱక యడలుచుండిన మహారాజుగారి స్థితి యేమిఁక? ఊఱడిల్లుము తల్లీ యూఱడిల్లుము!

అన్న— నే నెట్లూఱడిల్లఁ గలనే మాధురీ? ఈ గర్భశోకము నెట్లు భరింతునే?

(మూర్ఛిల్లును)

మాధు— అయ్యో దేవి మూర్ఛిల్లినదే! ఏమి గతి? సమయమునకు మహారాజుగా రైనను దగ్గఱ లేరే?

(విసరుచుండును)

[ ప్రవేశము – రాయలు దూరముగా ]

కృష్ణ— (దుఃఖముతో)

తే. స్వాంత మావంతయేని విశ్రాంతి గనదు,
నెవ్వగం జేసి కంటికిన్ నిదుర రాదు,
కన్ను మూసినఁ దనయుఁడే కానిపించు,
అక్కటా! యెంత దైవోపహతుఁడ నైతి!

ఆహా నా సంకల్ప మంతయు నెంతలో నెట్లయినది! నే నెంత మంద భాగ్యుఁడనో! నేఁటితో నా యాశ లన్నియు నడుగంటినవి గదా!

శా. రారాజుల్ పడిగాపు లై కొలువ, వీరారాతివారంబు లై
వారంబుల్ పచరింప, మద్యశము విద్వాంసుల్ కవీశాను లిం
పారన్ సన్నుతి సేయఁ, బొల్చు ననుఁ గట్టా! నేఁటి కీరితి దు
ర్వారంబైన దురంతచింతలఁ దపింపం జేసితే దైవమా!

అక్కటా! దేవి దుఃఖముఁ జూచినఁ గడుపు మఱింత తఱుగుకొనిపోవు చున్నది. నే నేమని యూఱడింతును?

అన్న— (మూర్ఛ దెలిసి) నాఁడే ప్రాణేశ్వరు ఖడ్గమునకు బలి యైయుండిన ఈ గర్భశోకము ననుభవింపకపోదునే.

కృష్ణ— (వినుట నటించి) అబ్బా! వజ్రపాతము గదా యీ మాట!

మాధు— (ఎదుటఁ జూచి) అమ్మా! అదుగో మహారాజుగారు.

అన్న— (లేచి యెదు రేఁగి) నాథా! (అని, మీఁది కొఱగును)

కృష్ణ— (దుఃఖముతో) దేవీ! (అని పట్టుకొనును)

అన్న— నే నెంత పాపముఁ జేసితిని నాథా! (వెక్కివెక్కి యేడ్చును)

కృష్ణ— దేవీ! మన మిర్వురమును ఇందు సమానభాగులమే. అట్టి పుత్రరత్నము మన కెట్లు దక్కును? "సుకృతీ గతాయుః", ఇట్లు పొగిలి పొగిలి యేమి చేయఁగలము? నాకుమాత్ర మూఱట గలదా? ధైర్యము వహింపుము,

అన్న— అయ్యో నా ముద్దులపట్టినిఁ జూడకుండ నే నిం కెట్లు మనఁగలను?

కృష్ణ—

మ. కలికీ! యూఅటఁ జెందుమా యిఁక; ఇటులన్ కన్నీరు
మున్నీరుగా
విలపింపన్ ఫల మేమి? ప్రాణులకు నుర్విన్ దేహబంధంబు ని
శ్చలమే? అల్లదె వాహినిం బడిన కాష్ఠవ్రాతమ ట్లొక్కచోఁ
గలియున్ బాయును; దీని కింత వగవంగాఁ జెల్లునే ధీయుతుల్?

దేవీ! ఆ పుత్త్రఘాతకుని జాడఁ గనిపట్టుటకై మన మురహరుని నియమించితిని. పట్టువడినతోడనే వానినిఁ జిత్రవధ గావించి నీకు మనశ్శాంతినిఁ గలుగఁ జేసెదను. నీ వింక లోని కేఁగి పరుండుము.

అన్న— అయ్యో నాథా! ఆ ఘాతకునిఁ జంపినంతమాత్రాన మన కుఱ్ఱవాఁడు లేచి వచ్చునా?

కృష్ణ— అట్లు గాదు. దండనార్హుల దండింపకుండుట రాజధర్మము గాదు.
మాధురీ! దేవినిఁ గొంపొమ్ము.

మాధు— చిత్త మట్లే.

(అన్నపూర్ణతో నిష్క్రమించును)

కృష్ణ— (పోఁబోవును)

[ప్రవేశము — ఎదురుగాఁ మురహరుఁడు నగల బరణితో]

కృష్ణ— (ఆత్రముతో) పట్టువడెనా పుత్రఘాతకుఁడు మురహరా?

ముర— (ఖిన్నవదనుఁడై మిన్నకుండును)

కృష్ణ— పలుక వేమి? పట్టువడెనా లేదా?

ముర— (హీనస్వరముతో) చిత్తము పట్టువడినాఁడు.

కృష్ణ— (ఆత్రముతో) ఎవఁడు వాఁడు?

ముర— (ఊర కుండును.)

కృష్ణ— (కోపముతో) చెప్ప వేమి?

ముర— చెప్పుటకు నోరు రాడకున్నది ప్రభూ!

కృష్ణ— సందేహ మేటికి? త్వరగాఁ జెప్పుము!

ముర— ప్రభూ! క్షమింపుఁడు.

కృష్ణ- (కోపముతో) ఎవరిని క్షమించుట? చెప్పెదవా లేదా?

మురహ— ప్రభూ!

కృష్ణ— నీ క్షేమైన మతి పోయినదా?

మురహ— లేదు ప్రభూ!

కృష్ణ— లేకున్నఁ జెప్ప వేమి? ఆ ఘాతకుఁడు నీ క్షేమైనఁ గావలసినవాఁడా?

మురహ—హరిహరీ! ఎంత మాట!!

కృష్ణ— ఇంతకుఁ జెప్పెదవా లేదా?

మురహ— మనకు సన్నిహితులే ప్రభూ!

కృష్ణ— (ఆశ్చర్యముతో) సన్నిహితులా?

మురహ— సచివోత్తములు గూడ.

కృష్ణ— సచివోత్తములు! అనఁగా?

మురహ— (మిన్నకుండును)

కృష్ణ— చెప్ప వేమి?

మురహ— అ...ప్పా...జిగారు.

కృష్ణ— (నిర్వెఱపడి) ఆఁ అప్పాజి! అప్పాజి!! (కూలఁబడి) అప్పాజీ!!! నే నమ్మఁ జాలను. నమ్మఁ జాలను. అప్పాజి యేమి? ఇట్టి దారుణకృత్యమున కొడి గట్టుట యేమి? మురహరా! నీవు భ్రమపడుచున్నావు.

మురహ— ఎంత మాట ప్రభూ! మీ రట్లనుకొనుట సహజమే. నేనును దొలుత నట్లే యనుకొంటిని.

కృష్ణ— ఆఁ, ఏమి యీ వైపరీత్యము!

మురహ— వైపరీత్యమే మఱి. (చేతిలోని నగల బరణి తెఱచి, పిల్లవాని పులిగోరు హారమును దీసి) దీనినిఁ జిత్తగింపుఁడు ప్రభూ;

కృష్ణ— (చూచి) ఇది కుఱ్ఱవాని హారమే. ఇందు వాని పేరు గూడఁ జెక్కఁబడియే యున్నది. ఇది నీ కెక్కడ దొరకినది?

మురహ— వారి యింటనే.

కృష్ణ— అప్పాజి యింటనే?

మురహ— చిత్తము.

కృష్ణ— ఆయన విరోధు లెవ్వరైన ఈ పని గావించి ఆయన యింటఁ బడవైచి రేమో!

ముర— నేనును అలాగే యనుకొంటిని. కాని, నేను వారి యింటికిఁ బోవుసరికే...

కృష్ణ—నీవు వారి యింటి కేల పోతివి?

ముర— ఘాతకుని జాడ నేమైనఁ గనుఁగొన్నా రేమో యని అప్పాజిగారి నడుగుటకై...

కృష్ణ— ఎప్పుడు పోతివి?

ముర— ఈ రాత్రియే.

కృష్ణ— అడిగితివా?

ముర— లేదు ప్రభూ!

కృష్ణ— ఏల యడుగలేదు?

ముర— నేను వారి యింటి సమీపమునకుఁ బోవుసరికే, లోపల నేవో గుసగుసలు వినిపించుటచే 'ఏమిరా యీ గుసగుసలు' అని వెలుపలనే యుండి విని, వారి మాటలలో అబ్బాయిగారి పులిగోరుహారముఁ గూర్చిన ప్రస్తావము వచ్చినందున, వా రందఱు నిద్రించినవెనుక మెల్లఁగా నింటఁ జొచ్చి పరికింపఁగా నం దొక పెట్టెలో నీ బరణి కనిపించినది; తెఱచి చూతును గదా అబ్బాయి గారి హార మిందు దొరకినది. ఇంతలో వారికిఁ గొంచెము మెలఁకువ వచ్చుచున్న ట్లుండఁగా ఆలసించుటకు లేక యీ బరణియే తీసికొని వచ్చితిని; (అని, బరణిలోనుండి తిమ్మరుసు తోడాలు తీసి చూపును)

కృష్ణ— (చూచి) కుఱ్ఱవాని నామకరణమునాఁడు నేను అప్పాజికి బహూకరించిన తోడాలే యివి! అప్పాజి యింట నెవరెవరు మాటలాడుచుండిరి?

ముర— అప్పాజిగారు తమ తమ్మునితోను గుమారునితోను మాటాడుచుండిరి.

కృష్ణ— ఏమి మాటాడుచుండిరి?

ముర— తన చిరసంకల్ప మీనాఁటికి సిద్ధించిన దనియు.....

కృష్ణ— ఆఁ!

ముర— నేఁటితో రాజవంశమును నిర్మూలించితి ననియు.....

కృష్ణ— ఆఁ! ఆఁ!

ముర— ప్రజానురక్తి తన పట్టున నుండుటచే నింకఁ దన కుమారుని నిరాటంకముగా ఆంధ్రసామ్రాజ్యపట్టభద్రునిఁ గావింతు ననియు—...

కృష్ణ— ఔరా! నే నుండఁగానే తన కుమారునకుఁ బట్టాభిషేకమును జేయఁ గలఁడుగా!

మురర— నేఁడో రేపో...ఆ యభ్యంతరమును గూడఁ దొలఁగించుటకే......వంక ల్పించుచున్నారు.

కృష్ణ— (అదరిపడి) ఏమీ నన్నుఁ గూడ హత్య గావించుటయే?

(తెరలోఁ గలకలము)

కృష్ణ— ఏ మా కలకలము?

భటుఁడు— (పరుగుపరుగున వచ్చి) ప్రభూ! అప్పాజిగారి యింట దొంగలు పడినా రఁట!

కృష్ణ— సరే పొమ్ము.

భటు— (నిష్క్రమించును)

మురర— ప్రభూ! ఆ దొంగలు మ ఱెవ్వరును గారు, వీఁడే. (అని, తన్నుఁ జూపించు కొనును)

కృష్ణ— ఔరా! అప్పాజి యెంత ద్రోహ మొనర్చినాఁడు! అతఁ డిట్లు కావించు నని స్వప్నమం దైనను అనుకొనలేదే! కాలసర్పమును బూలమాల యని భ్రమించి మోసపోతినే! ఎంత ఘోరము! ఎంత దారుణము!!

(అప్పాజి నుద్దేశించి)

అప్పాజీ! నీకు నే నేమి యపకారము గావించితిని? ముదిసి ముప్పున నున్న నీ కిట్టి ఘోరహత్య గావింపఁ జేతు లెట్లాడెను? పై పెచ్చు మేకవన్నె పులి వైన నన్నె ట్లూరడింప వచ్చితివి?

అప్పాజీ! ఛీ! నీ వింక అప్పాజివి గావు. ఓరీ ద్రోహీ! పుత్త్రఘాతకా! ఇట్లు నా వంశమును నిర్మూలించి, ఈ సామ్రాజ్య మంతయు నీ కుమారునకే కట్టఁబెట్ట నెంచితివిగా! (పరిక్రమించి) అందులకే కాఁబోలు కొన్నాళ్ళనుండి నీ ముఖమున నేమో యాందోళనము పొడగట్టఁ జొచ్చినది! కాకున్నఁ గుమారుని పట్టాభిషేకమునకు నాఁ డట్లు అడ్డు చెప్పుదువా? ప్రజానురక్తి నీపట్టునఁ గల దని విఱ్ఱవీఁగుచున్నావుగా!

మురహరా! తత్క్షణమే పోయి......

మురర— ప్రభూ ఆజ్ఞ!

కృష్ణ— (కొంచె మాఁగి, సవితర్కముగాఁ దనలో) ఆఁ! చిన్ననాఁటినుండి నన్నుఁ బెంచి పెద్దఁ జేసి మహోన్నతికిఁ దెచ్చెనే! క్రూరదండనమా? ప్రజానురక్తి బలీయమే! పోనీ, పిలిపించి విచారింతునా? విచారించి ఫలము! అంతటి మేధావి, కాదు కాదు, అంతటి మాయావి తన ద్రోహమును గప్పిపుచ్చుకొనఁ జాలఁడా? ఎంతటి మాయావి గాకున్న నాఁడు మా యన్న నా కనులు దీయించి చూపు మన్నపుడు నన్నుఁ దన యింట డాఁచి, మేఁక కన్నులు చూపి యాతని మోసగించునా? ఆతఁ డెంతటి కైనను జాలినవాఁడే...నా కుమారుఁడే యి ట్లయినపుడు నా కింకఁ బ్రజాభిప్రాయముతోఁ బని యేమి? మఱి, యింతటి రాజద్రోహమునకుఁ బాల్పడినవాఁ డెంతవాఁ డైన నేమి? శిక్షార్హుఁడే.

మురహరా! తత్క్షణమే పోయి, రక్షకభటాధికారి ఆదెప్పనాయకునితో మా యాజ్ఞగాఁ దెల్పుము—ఆ రాజద్రోహి తిమ్మరుసు నెదుటనే ఆతని కొడుకును దమ్ముని& జిత్రవధ గావించి, ఆవలఁ దిమ్మరుసు కనులు వెఱికి, అన్నపానము లీయకుండఁ గారాగారమున బంధించి యుంచు మంటి మని. పొమ్ము! తత్క్షణమే పొమ్ము!!

మురః— (కదల కుండును)

కృష్ణ— (కోపముతో) పో వేమి?

మురః— (భయవిచారములు నటించుచు) ప్రభూ! అప్పాజిగారిపట్లఁ దా నింత... దారుణకృత్యమును........

కృష్ణ— (పట్టరాని కోపముతో) ఏమీ దారుణమా? ఆ ఱేండ్ల పసివానిని హత్య గావించుట దారుణము గా దేమి? అప్పాజి! అప్పాజిగాని మ ఱెవ్వఁడైనఁ గాని, పుత్త్రిఘాతకుని రాజద్రోహిని సైరింపు మందువా? చాలు, నా మాట కెదురాడక పొమ్ము.

మురః— (కదల కుండును)

కృష్ణ— (కోపముతో) కదల వేమి?

మురః— ఆదెప్పనాయకుఁడు నా మాట పాటించునా ప్రభూ?

కృష్ణ— (ఆలోచించి) అవును నిజమే. జాబే వ్రాసి యిచ్చెదను. (జాబు వ్రాసి యిచ్చుచు) ఇదే మా యాజ్ఞను తత్క్షణమే నెఱవేర్పవలె ననియు, లేకున్న శిరశ్ఛేదముఁ గావింతుఁ ననియు జెప్పుము. పో! తత్క్షణమే పో!!

మురః— (భయము నటించుచు) చిత్తము.

కృష్ణ— (కోపముతో నిష్క్రమించును)

ముర — (సంతోషముతోఁ దనలో) బలే! నేఁటికి ఫలించినది నా ప్రయత్నము, నా మిత్త్రుని మనోరథము! ఇదిగో యీ యాజ్ఞాపత్త్రమే తిమ్మరుసుమంత్రివంశ నిర్మూలనకుతారము!

ఇదే ఆదెప్పనాయకున కీ లేఖ నందిచ్చుట! వెంటనే యిటనుండి యుడాయించుట! మఱునాఁడే రాయలపై దండయాత్రాసన్నాహము! బలే బలే!! (నిష్క్రమించును)

---

## 23 వ. రంగము — కారాగారము

[తిమ్మరుసు, కనులు తీయఁబడి తీవ్రబాధతోఁ దపించుచుండును]

తిమ్మ — అబ్బా బాధ!...నరకబాధ!! ఈ బాధయే మ ఱెవ్వరి మూలమున నేని కలిగియుండిన నింత విచారమే లేకుండెడిది గదా! ఎవ్వని శ్రేయోభివృద్ధికై నాజీవితసర్వస్వమును ధారవోసితినో ఆతనివలననే కలిగినదే! అబ్బా!

తే. మోహమునఁ, గూలిపోనున్న మొలకఁ దెచ్చి
పదిలముగఁ బెంచి, తగిన దోహద మొసంగ
అది మహావృక్షమై నేఁటి కక్కటకట!
విఱుచుకొని మీఁదఁ బడె విధిప్రేరణమున!

అహో ఎంతటి కానికాలము సంభవించినది! వీరాధివీరులగు వైరిరాజులను సైతము నా ప్రజ్ఞాబలముచే వశ్యులఁ గావించుకొని, నేఁటివఱకు నేనే రాజాధిరాజుగా రాజ్యచక్ర మంతయు నడపుచు, ఎల్లవారిచే మన్నన లందిన నాకు, ఈ వార్ధకదశలో ఎట్టి దుస్థితి పట్టినది!

అబ్బా! దేహ మాపాదమస్తకము పెనుమంటలతో మండిపోవుచున్నదే కాని యీ పాడుప్రాణము లింకను ఈ బొందిని వీడిపోకున్నవే! విలపించుట కేనియు శక్తి లేకున్నది...అయ్యో! ఏమి నా వెఱ్ఱి! నే నిపుడు దేని కని విలపింతును!

మ. అకటా! నా కులవర్ధనుండు విమలస్వాంతుండు ఏకైకపు
త్రకుఁ డబ్బంగిని ఘోరదుర్మరణ మందన్ గాంచి దుఃఖింతునా!
అకలంకుండగు తమ్ముఁ డట్లు నిహతుం డౌటన్ విచారింతునా!!
ఇఁక ని ట్లీ దురవస్థపాలయిన నాకే నేను శోకింతునా!!!

కామానాయకుఁడు— (దుఃఖముతోఁ బరుగుపరుగునఁ బ్రవేశించి) అయ్యో, తండ్రీ! మీ కెట్టి దురవస్థ ఘటిల్లినది! (తిమ్మరుసు మోమువంకఁ జూచి) హా దుర్భరము! దుర్భరము!!

తిమ్మ—(ఆలకించి) ఎవ రక్కఁడ? కామానాయకుఁడా? విచారింపకుము నాయనా?
కామా (దుఃఖముతో)

శా. హా తండ్రీ! జగ దేకపూజ్యుఁడవు, నీకా యిట్టి ఘోరంబుఁ జే
సేతన్ ఱేఁడు ఘటించుటల్? కడకు నిస్సీ! యంధుఁడై పోయెనే?
చైతన్యంబు నశించెనే తనకు? ఏ జాల్ముండో వంచింప వి
ఖ్యాతంబౌ భవదీయపూర్వచరితం బాపాటి పాటింపఁడే!

తిమ్మ— నా పురాకృతకర్మఫల మి ట్లుండ రాజు నెందులకు దూషించెదవు?

కామా— ఏమీ మీ కర్మఫలమా యిది తండ్రీ? అక్కటా! పామునకుఁ బాలోసి పెంచిన ట్లాయెఁ గదా మీ రా దుర్మదాంధున కొనర్చిన మే లంతయు!

తిమ్మ— నీ వైనను రాజునాగ్రహమునకుఁ బాత్రుఁడవు గాక సుఖముగా బ్రతుకుము నాయనా!

కామా— అయ్యో తండ్రీ! మీ కే యింత ఘటిల్లినపు డింక నా ప్రాణములకా యాసించువాఁడను?

తిమ్మ— (ఆత్రముతో) అటు లయిన నీ యుద్యమ మేమి?

కామా— ఏ మున్నది? ప్రతీకారము, ప్రాణత్యాగము.

తిమ్మ—(ఆత్రముతో) అఁ అఁ! నామీఁది గౌరవము నిన్ను ఉన్మత్తునిఁగాఁ జేయుచున్న దే కామానాయకా! వలదు, నీ కీ సాహసము వలదు.

కామా— సాహసమునకు సాహసమే ప్రతీకారము.

తిమ్మ— కాదు. ప్రతీకారమువలనఁ బగ పెరుఁగునే కాని తఱుఁగదు. అది గాక, రాజద్రోహమే పాప మైనపుడు రాజహత్య మహాపాతక మని వేఱె చెప్పవలయునా? అందును విశేషించి రాయల యెడలనా నీ కిట్టి దుస్సంకల్పము?

కామా—— రాయ లైన నేమి? మ తెవ్వఁ డైన నేమి గుణహీనుఁ డైనపుడు?

తిమ్మ—— రాయలు గుణహీనుఁడు కాఁడు, కానేరఁడు. పుట్టిన దాది ఆతని యోగ్యత నాకుఁ దెలియును. నీ కెట్లు తెలియఁ గలదు? అతఁడు సాక్షాద్విష్ణ్వంశ సంభూతుఁడు.

కామా—— (ఆశ్చర్యముతో) విష్ణ్వంశ !!

తిమ్మ—— నిశ్చయముగా.

కామా—— మఱి నేఁటి దారుణకృత్యములో?

తిమ్మ—— ఇన్నిటికి మూలము ఆతని యమాయికతయే,

కామా—— అమాయికుఁడా రాయలు?

తిమ్మ—— నిస్సంశయముగా.

కామా—— ఎట్లు?

తిమ్మ—— అమాయికుఁడు కానిచో ఆ మాయావిని అంతగా విశ్వసించునా? కుమారునిఁ గోలుపోవునా? "ప్రమాదో ధీమతా మేవ".

కామా—— అయ్యో! ఇంకను ఆతనిపై మీ కెంతటి మమకారము తండ్రీ! పుత్రనిర్విశేషముగఁ బెంచి పెద్దఁ జేసిన మీ వాత్సల్యము ఆతని గురుద్రోహమును సైతము సైరింపఁ జేయుచున్నదే!......కాదు, మఱపింపఁ జేయుచున్నదే!

తిమ్మ—— దానికిని ఆతని యోగ్యతయే కారణము.

కామా—— ధర్మాధర్మవిచారణదక్షత లేని ఆతనికి యోగ్యత యెక్కడిది తండ్రీ?

తిమ్మ—— ధర్మనిర్ణాయకుఁడు దైవ మొక్కఁడే నాయనా,

కామా—— (కోపముతో) దైవము! ధర్మము!! మీ రేమైన ననుఁడు. అక్రూరాత్ముని......

త్రి—— ఆఁ ఆఁ కామానాయకా! నీ కీ తొందరపాటు తగదు. రాయలను నిందించి నా మనస్సును మఱింత క్షోభింపఁ జేయకుము.

నిజముగా నీకు నాయెడల ఆదరమే కలదేని, రాయలకు నా నిర్దోషిత్వమును నిరూపింపుము. అదియే నీవు నా కిప్పట్టునఁ జేయఁ గల మహోపకారము. అపుడే నా యాత్మకు శాంతి.

కామా— ఆహా మీ క్షమాగుణసంపత్తికే మందును ? (మోకరించి) మీ దుర్భరావస్థవలని కోపోద్రేకమున ఏమేమో వదరి మీ మనస్సు నొవ్వఁ జేసితిని, క్షమింపుఁడు. ఇదే మీ యాజ్ఞానుసారమే వర్తించెదను.

కామా— (లేచి) అహా కాలవైపరీత్యము! ధర్మమునకు నేఁ డెట్టి దుస్థితి సంభవించినది!!

శా. ధర్మంబే జయ మొందు నంచు అల శాస్త్రాలెల్ల ఘోషించుగా!
తార్కా రయ్యె నదేమొ నేఁటి కకటా తత్సర్వమున్! గానిచో
దుర్మార్గుల్ జయ మొంద నేర్తురె? మహాత్ముల్ దుర్గతిం గందురే?
ధర్మధ్వంసకుఁడౌ కలిప్రభున కే దైవంబు తో డయ్యెనే!!

(నిష్క్రమించును)

తిమ్మ— అక్కటా! ఇన్ని కష్టము లనుభవించుటకే కాఁబోలు దైవము నా కింతటి పాపిష్ఠపుదీర్ఘాయు వొసంగినది! ఈ నిర్భాగ్యపుఁదిమ్మరుసు గతించిన వెనుక ఇట్టి కష్టముల కింకఁ దా వెక్కడ దొరకునో!

కృష్ణరాయా! నాపై నీ కంత కోపమే కలిగిన నొక్కపోటుతో నన్నుఁ గడతేర్చియుండరాదా తండ్రీ! ఇంతటి గర్భశోకము ననుభవింపకపోదునే!

[ ప్రవేశము – రాయలు ]

కృష్ణ— (కసితో) పుత్త్రహత్య! రాజద్రోహము!! ప్రతిఫలము!!!

తిమ్మ— (వినుట నటించి) నమ్మితివా ? నమ్మితివా వత్సా ?

కృష్ణ— నమ్మియే యింత చెడితిని.

తిమ్మ— ఎవనిని నమ్మి ?

కృష్ణ— నమ్మఁ గూడని వానిని నమ్మి.

తిమ్మ— ఎవ్వఁ డా నమ్మఁ గూడని వాఁడు ?

కృష్ణ— ఎవ్వఁడో తెలియ దేమి ? నీ యంతరాత్మ నడిగి కొనుము.

తిమ్మ— వత్సా! నాకుఁ గనులు దీయించితివే కాని, నిజముగా నీకుఁ గనులు లేవు, లేనేలేవు.

కృష్ణ— అవును లేవు. ఉన్నచో నిట్టి మాయాకూపమునఁ గూలుదునా? కుమారునిఁ గోలుపోవుదునా?

తిమ్మ— హుఁ! కాలము దీఱినవాఁడను, నేఁడు గాకున్న రేపైనను నేను బోవలసినవాఁడనే. కాని, వత్సా! ఒకందుకు సంతోషము. రాజసేవాఫల మిట్టిదని నీవు లోకమునకు నేఁ డొక శాశ్వతమైన గుణపాఠమును నేర్పినవాఁడవైతివి.

కృష్ణ— రాజద్రోహమునకు ఫల మనుము.

తిమ్మ— కానిమ్ము, ఇదే నీకు నా కడసారి సందేశము—మహనీయుఁడు విద్యారణ్యులు నాఁడు నాటిన యాంధ్రసామ్రాజ్యాంకురమును భద్రముగాఁ బెంచి నీ చేతులలోఁ బెట్టితిని. నీవు దాని నెట్లు నిలువఁబెట్టుకొనెదవో చూచుకొనుము.

ఉ. చెల్లెను దీర్ఘకాల మెటొ, సేవ యొనర్చితి నోపినట్లు నా
తల్లికిఁ దెల్గుసీమకు, సదా మదిఁ గోరితి నీదు సేమమే,
కల్లయిపోయె నాదు బ్రతు కంతయు, నీకును నాకు నేఁటితోఁ
జెల్లె ఋణంబు, ఏ మనఁగఁ జెల్లును నిన్నిఁకఁ? గృష్ణరాణ్మణీ!

ఉ. ఏయఘ మే నెఱుంగ, నెటు లీల్గెనొ నాఁడు భవత్సుతుండు, నా
రాయణ! నాదుకంఠమునకా యది చుట్టుట? ఏమనందు నిన్?
శ్రీయును నాయువుం గలిగి సేమముగా నిల యేలికొమ్ము వ
త్సా! యిదె యేఁగుచుంటి నల నాకముఁ జేరఁగఁ గృష్ణరాణ్మణీ!

కృష్ణ— (కోపముతో) నాకము కాదు, నరకము.

తిమ్మ— మంచిది.

తే. నాకమున కేఁగువాఁడనో, నరకమునకె
పోవువాఁడనో, అయ్యది దైవ మెఱుఁగు;
నరక మంతయు నేఁడు నీ దొరతనాన
ననుభవించితిఁ గాదె! రాజాధిరాజ!

కృష్ణ— (కోపముతో) ఇంకను సమాధానాలు సందేశాలు! రాజద్రోహీ!

తిమ్మ— కాఁడు. రాజద్రోహి కాఁడీ తిమ్మరుసు. ఏనాఁటికేని నా నిర్దోషిత్వము నీకు వెల్లడి కాకపోదు, వత్సా! వెల్లడి కాకపోదు.

కృష్ణ— నిర్దోషిత్వము! (వికటపునవ్వుతో నిష్క్రమించును)

తిమ్మ— హాఁ పాపము! అతఁడేమి సేయును? ఆ మాయావిని నమ్మి వంచితుఁడైనాఁడు. ఇదంతయు నా దుర్విధి!

నాకై నేను దుఃఖింపను. పుత్త్రసోదరుల దుర్మరణమునకైనను అంతగా విలపింపను. కాని, యీ తిమ్మరుసు బొంది కడకు శాశ్వత మగు దుర్భర నిరాపనిందతోఁ బోవలసి వచ్చెనే యని కుందుచున్నాను.

అబ్బా!......బాధ!!......మరణబాధ!!! హా పరమేశ్వరా!

తే. త్రికరణంబుల నిన్నె యర్చింతునేని
ఈ భవంబున ఏపాప మెఱుఁగనేని
కల్ల నిజమును జేనికిన్ వెల్లడించి
ధన్యుఁ జేయవె నన్ను సత్యస్వరూప!

దయామయా! ఇదే నీ భక్తుని కడసారి వందనము. నారాయణ! నారాయణ!! నా...రా...యణ!!

(వ్రాలిపోవును)

[ తెర పడును ]

## 24 వ. రంగము — రాయల శయనమందిరము

[ రాయలు శయ్యపై నిద్రించియుండును ]

కృష్ణ— (నిద్రలోఁ గలవరించుచు) ఊఁ ఊఁ ఊ అ...ప్పా...జీ...అ...ప్పా...జీ ఊఁ ఊఁ ఊఁ (అని యులికిపడుచుండును)

అన్న— (ఆత్రముతోఁ బ్రవేశించి, రాయలను దట్టి) నాథా! ఏమిట్లు ఉలికిపడుచున్నారు!

కృష్ణ— (మెల్లఁగాఁ గన్నులు దెఱచి, నలువైపులు చూచుచు) అ...ప్పా...జీ... ని...ర్దో...షి!

అన్న— అయ్యో! ఏటికీ కలవరపాటు? ఏమైనఁ గల గన్నారా నాథా?

కృష్ణ— అవును...కలయే...కాదు...కల గాదు. ఇప్పుడే అప్పాజీ బీభత్సాకారముతో నా కగపడి తాను నిర్దోషి ననియు, నేను దనకు మహాద్రోహ మొనర్చితి ననియు, ఏమేమో......అబ్బా...దేవి! నన్నుఁ బట్టుకొనుము. నా కేమో అయోమయముగా నున్నది.

అన్న— అప్పాజిగారిపట్ల నిజముగా మీరు చాల తొందరపడినారు నాథా! అందుకే మీ మన సిట్లు......

(వీథిలో బిచ్చగాని పాట)

## (12) గేయము

కృష్ణ— (ఆలకించి, కలవరపాటుతో) ఈ యర్ధరాత్రమున ఈ బిచ్చగాఁ డెక్కడ నుండి వచ్చెనో!

అన్న— ఇది యర్ధరాత్రము గాదు నాథా! తెల్లవాఱుచున్నది.

కృష్ణ— ఏమో నా కేమియుఁ దెలియుట లేదు. అంతయు నంధకారమయముగా నున్నది. వ్యాకులపడుచున్న నా మనస్సును మఱింత వ్యాకులపఱచినాఁడే యీ బిచ్చగాఁడు!

(తెరలో)

నేఁటికిఁ బట్టువడితివిరా ద్రోహీ! ఇం కెందుఁ బోఁగలవు?

కృష్ణ— (ఆలకించి) కామానాయకుని కంఠధ్వనివలె నున్నదే! ఎవ్వనిమీఁద నాతని కంత యాగ్రహము?

కామానాయకుఁడు—(మురహరునిఁ ద్రాళ్ళతో బంధించి తెచ్చి) హా మహారాజా! ఈ మాయావిని నమ్మి ఘోరనరకకూపమునఁ గూలితిరి గదా!

కృష్ణ— (నివ్వెఱపడి) ఏ మిది కామానాయకా! మురహరు నేల బంధించితివి?

కామా— ఏల బంధించితినా! మీ కొంప దీసిన పరమద్రోహి యని.

కృష్ణ— మురహరుఁడా?

కామా— ఈ విశ్వాసమే మి మ్మింతకుఁ దెచ్చినది.

కృష్ణ— ఏమీ, మురహరుఁడు ద్రోహియా?

కామా— ఇదిగో చదివికొనుఁడు రక్షకభటాధికారి ఆదెప్పనాయకుని యుత్తరము (అని, రాయలకు జాబు నిచ్చును)

కృష్ణ— (జాబు విప్పి యిట్లు చదువును)

"శ్రీ శ్రీ కృష్ణదేవరాయసార్వభౌములకు రక్షకభటాధికారి ఆదెప్ప నాయకుఁడు నమస్కారపూర్వకముగాఁ గావించుకొను విజ్ఞప్తి.

మహారాజా!

తమయొద్ద నిన్నాళ్ళు పరమాప్తుఁడుగా మెలఁగుచున్న యీ మురహారుఁడు నేఁటి యర్ధరాత్రమున నగరమునుండి పరారి యగుచుండఁగా నాచేఁ బట్టుపడినాఁడు. ఈతని వైఖరిఁ బరికింపఁగా మన శత్రుకోటిలోనివాఁడుగాఁ గన్పట్టుటచే నిర్బంధించి యడుగఁగాఁ దన గుట్టు బయలపడు నని పరస్పర భేదముగాఁ దెలుపుటచే నా యనుమానము స్థిరపడినందున బంధించి, మన కామానాయకునితో దేవరయొద్దకుఁ బంపుచున్నాను. దేవర విచారించి కర్తవ్యమును దెలియఁ జేయుదురు గాక యని వేఁడుచున్నాను,

ఇట్లు తమ విధేయుఁడు,
**ఆదెప్పనాయకుఁడు.**"

కృష్ణ— (మురహారునితో) ఓరీ! నీ వెవ్వఁడవు?

ముర— ప్రభూ! ఏటికిట్లడిగెదరు? తమ భృత్యుఁడ నగు మురహారుఁడను గదా!

కామా— (వికటపునవ్వుతో) మురహారుఁడు! ప్రాణహారుఁడు కాఁడేమి?

కృష్ణ— నీవు పరారి యగుటకుఁ గారణ మేమి?

ముర— (మిన్నకుండును)

కృష్ణ— (కోపములో) పలుక వేమి?

కామా— (మురహారునితో) ఈ వస్త్రము లెవ్వరివో తెలియునా నీకు? (అని, రక్తసిక్తము లగు మురహారుని వస్త్రములఁ జూపును)

కృష్ణ— (చూచి, ఆశ్చర్యముతో) జలగండమునుండి కుమారుని రక్షించిననాఁడు మెచ్చి నే నీతని కొసంగిన వస్త్రములే యివి! ఇట్లు రక్తసిక్తము లై యున్న వేమి?

కామా— హత్యాసమయమున బిడ్డరక్తము చింది పడుటచే.

కృష్ణ— ఇవి నీ కెక్కడ దొరకినవి కామానాయకా?

కామా— ఈ మాయావి యీ రాత్రి యెందును గనఁబడనందున అనుమానము గలిగి, యీతని గది తాళము పగులఁ గొట్టి లోపలఁ బరికించి చూతును గదా యొకమూల మఱుఁగుగా నివి దాఁచి యుంచఁబడినవి.

కృష్ణ— (మురహరునితో) ఓరీ! దీని కేమందువు ?

ముర— (తనలో) ఇంక నే నేమి చెప్పినను బ్రయోజనము లేదు. కానీ, నా మిత్త్రుని సంకల్పమును గొనసాగించితిని. అదే చాలు. మిత్త్రికార్యమునకై ప్రాణము లొడ్డుచున్నాను. ఇదియు మేలే. కావున ధైర్యము వహించెదను (ప్రకాశముగా) ప్రభూ! న న్నే మైన నొనర్పుఁడు! మీ పుత్త్రుని హత్య గావించినదియు, అప్పాజిగారిపై ఆ నింద మోపినదియు నేనే.

అన్న— అక్కటా! ఎంత దారుణము !!

కృష్ణ—(కూలఁబడి) ఓరీ ద్రోహీ! నిన్ను నమ్మి యెంతటి ముప్పుఁ దెచ్చుకొంటినిరా!

కామా— ఈ మాయావి యిందుఁ గాలిడినదిమొదలు అప్పాజిగారికి ఆందోళనముగా నే యున్నది.

కృష్ణ— అప్పాజి యాందోళనమున కదియా కారణము! అయ్యో! ఎంత మూఢుఁడ నైతిని!

(మురహరునితో) ఓరీ ద్రోహీ! ఈ దారుణ కృత్యమువలన నీకుఁ గలిగిన ప్రయోజన మేమిరా ?

ముర— నా మిత్త్రుని సంకల్పము.........(నోరు కఱచుకొనును)

కృష్ణ— (కోపముతో) ఎవఁడురా నీ మిత్త్రుఁడు ?

ముర-

ృష్ణ- (కోపముతో) చెప్ప వేమి ?

ముర— (ఊరకుండును)

కృష్ణ— (పట్టరాని కోపముతో) ఓరీ చెప్పెదవా లేదా ? (అని మీఁది కుఱుకుచు) ఎవ్వఁ డా మిత్త్రుఁడు ?

ముర— వీరభద్రగజపతి.

అన్న— అయ్యో అన్నయ్యా! ఎంత దురంతమున కొడిగట్టితివి !

— (అదరిపడి) ఏమీ వీరభద్రుఁడా ? ఎవఁడురా అక్కడ ?

భటుఁడు— (ప్రవేశించి, నమస్కరించి) ప్రభూ ఆజ్ఞ!

కృష్ణ— ఓరీ యీ పాపాత్మునిఁ జిత్రవధ గావించి, కాకులకు గ్రద్దలకును వేయు మంటి మని మా యాజ్ఞగా అదెప్పనాయకునకుఁ జెల్పుము, పొమ్ము!

భటు— చిత్తము (మురహరునిఁ దీసికొని పోవును)

కృష్ణ— (విచారముతో లేచి) అప్పాజీ! అప్పాజీ!! (అనుచుఁ బోవును; వెనువెంట అన్నపూర్ణ కామానాయకుఁడును బోవుదురు)

[తెర పడును]

## 25 వ. రంగము — కారాగారము

[తిమ్మరుసు మృతుఁడై పడియుండును]

[ ప్రవేశము—రాయలు, అన్నపూర్ణ, కామానాయకుఁడు]

కృష్ణ— అప్పాజీ! అప్పాజీ!! ప్రాణాలతో నున్నావా తండ్రీ! (తిమ్మరుసు దేహముఁ దడవి చూచి) అయ్యో! ఇం కెక్కడి అప్పాజీ! (తిమ్మరుసుపైఁ బడి మూర్ఛిల్లును.)

అన్న— కామానాయకా! నీరు నీరు!

కామా— (నీరు దెచ్చి యిచ్చును)

అన్న— (నీరు చల్లి, సేద దేర్చుచుండును)

కామా— మహారాజున కేమి యాపద వాటిల్లునో కదా!

అన్న— (నిట్టూర్చి) అయ్యో! ఇంతకన్ననా?

కృష్ణ— (మూర్ఛఁ దేలి) అప్పాజీ! నీకు నే నెంతటి ద్రోహ మొనర్చితిని! చిన్న నాఁటినుండి కన్నపుత్త్రునికన్న నెక్కుడు ప్రేమతోఁ బెంచి పెద్దఁ జేసి న న్నింతటి మహోన్నతదశకుఁ దెచ్చిన నీపైఁ గడకు నా కెట్టి యనుమాన పిశాచ మావేశించినది తండ్రీ!

శా. మాత్సర్యంబున నా కనుల్ వెఱికి చంపం జూడ మా యన్న, నన్
వాత్సల్యంబున డాఁచి ప్రోచితి వహో! నాపాలి దైవంబ వై;
ఉత్సేకంబున నీ కనుల్ వెఱికి నేనో నిన్నుఁ జంపించి నేఁ
డుత్సాహించితిఁ జూడ; నా మనసు ప్రమానో! రాయియో!! వజ్రమో!!!

అక్కటా! పసిపాపని మరణమునకే నే నింతగా దురపిల్లుచుంటినే, చేతి కెదిగిన చెట్టంత కుమారుఁడు సుగుణరాశి నీ పుత్త్రుఁడును, బరమపూజ్యుఁడు నీ తమ్ముఁడును నీ కంటిముందు అట్లు చిత్రవధ గావింపఁబడుటకు నీ వెంతగా విలపించితివో! ఈ నీ ఘోరదుర్మరణమునకై యెంత తపించితివో! న న్నెంత దూఱితివో! (కొంచె మాఁగి) ఛీ ఏమి నా యవివేకము! నన్ను నీ వెన్నఁడైనను దూఱుదువా తండ్రీ! న న్నెన్నఁ డైనను దూఱుదువా?

కృష్ణరాయా! నీ గౌరవ మంతయు నే మంట మడిసెను? నీ వివేక మంతయు నే యేటఁ గలిసెను? భవిష్యచ్చరిత్రలో ఈ విషాదగాథ అప్పాజి రక్తమున వ్రాయఁబడి నీ కింక శాశ్వతమైన కళంకము నాపాదింపకపోవునా?

ఉ. పూతచరిత్రు సర్వజనపూజితు భూసురు రాజనీతివి
ఖ్యాతునిఁ బ్రాణదాతను మహాత్ముని నీ హితకాము వృద్ధుఁ జే
సేతను నిట్లు చిత్రవధ సేయఁగ నోపితె! కృష్ణరాణ్మహా
పాతకి! దైవ మింక నినుఁ బట్టి పలార్పక యూరకుండునే?

పుట్టిననాఁటం గోలె నీకు సర్వవిధముల వజ్రకవచ మై, మూలశక్తి యై, శ్రీరామరక్ష యై, కాపాడి, జగద్విఖ్యాతిఁ జేకూర్చిన దైవసముఁ డగు అప్పాజికా నీ వింతటి ద్రోహ మొనర్చుట! కృతఘ్నుఁడా! ఆ మహనీయుని యప్రతిమానప్రతిభావిశేషంబునం గాకున్న నీ జీవితమున స్వయముగా నీవు సాధించిన ఘనకార్య మొక్క టేనియుఁ గలదే?

సీ. గర్భశాత్రవు లైన కటకసుల్తానుల
నేవురన్ నీవె నిర్జించినావా?
మాయలం బన్ని నిన్ మాయింప దొరఁకొన్న
యుత్కలేశుని నీవె యోర్చినావా?

పరరాజులకుఁ జిక్కి పరితపించిన నీదు
తెనుఁగుతల్లిని నీవె తేర్చినావా?
ఆసేతువింధ్యాచలావనీతల మెల్ల
ఈలీల నీ శక్తి నేలినావా?

తే. ఇన్నిటికి మూలశక్తి నీ కెవ్వఁ డట్టి
పూజ్యు నప్పాజి నేఁడు చంపుటయె దక్క
ఇస్సిరో! స్వయముగ మహోత్కృష్టకార్య
మే మొనర్చితి వేనాఁడు? కృష్ణరాయ!

విద్యానగరసామ్రాజ్యాధీశ్వరులలో నీయట్టి ఘోరరాక్షసుఁ డెన్నం డేనియు జన్మించెనే? నీ దారుణ సాహసస్వభావమే కదా ఈనాఁ డిట్లు ప్రళయకాలాఖిలమృత్యుదేవతాకరాళతాండవమునకుఁ గారణ మైనది! ఛీ! న్యాయాన్యాయవిచారణదక్షులు గాని నీవంటి రాజు లుండిన నేమి? మండిన నేమి?

సీ. నీ సాహసమె కదా! నినుఁ గళింగరణానఁ
బగఱ వంచనకుఁ బాల్పఱచె నాఁడు,
నీ సాహసమె కదా! నిరపరాధను నీదు
నిల్లాలిఁ జంపఁ బ్రేరించె నాఁడు,
నీ సాహసమె కదా! నీచాత్ముఁ దరిఁ జేర్చి
నీ సుతున్ గోల్పోవఁ జేసె నేఁడు,
నీ సాహసమె కదా! నీపాలిదైవమౌ
అప్పాజికే తెచ్చె ముప్పు నేఁడు,

తే. నాఁడు నేఁడును ఒక్కచందాన వెలిఁగి
కొసకు నీ సాహసంబె నీ కొంపఁ దీసె;
నిజము కల్లయు నరయఁగా నేర వైతి
వెంతటి యపాత్రుఁడ వయారె! కృష్ణరాయ!!

ఈ కారాగారమున అంతటి దుర్భరావస్థలో నుండియుఁ, జూడ నుత్సహించి వచ్చి కాఱులు ప్రేలిన యీ క్రూరకిరాతునకుఁ బుత్రవాత్సల్యముతో నీ వొసంగిన సందేశమును దలంచుకొన్నఁ, దండ్రీ! నా మేన నిపుడు పెనుమంట లెగయుచున్నవే! (నిట్టూర్చి) ఆహో! రాజ్యమదాంధత న న్నెంతకుఁ దెచ్చినది!

శా. రాజ్యప్రాజ్యమదాంధకారమున నేత్రా లుండియున్ గ్రుడ్డి నై
త్యాజ్యున్ ద్రోహిని బుత్రఘాతకుని నత్యంతాప్తుఁగా నమ్మి, యీ
పూజ్యున్ దైవసమున్ సపుత్రకముగాఁ బోకార్చి యీలీల, హా
రాజ్యాంతే నరకం ధ్రువ మ్మనుట తార్కాణించినాఁడన్ గదా!

అన్న— నాథా! ఊఱడిల్లుఁడు.

కామా— మహారాజా! మించినవెనుక వగచి యేమి ఫలము?

కృష్ణ— (తిమ్మరుసు మోమును బరికించి) అక్కటా! బ్రహ్మతేజోవిరాజితంబైన నీ ముఖారవిందము నామూలమున నేఁ డెంత బీభత్సాకారమును దాల్చినది తండ్రీ!

శా. ఒప్పుం దప్పు నెఱుంగఁ జెప్పి నను నెంతో ప్రేముడిం జూచు నీ
యప్పుం దీర్చుకొనంగ లేనయితి, బ్రహ్మఘ్నుండ, నీ కొంప కే
ని ప్పంటించితి, నెట్లు సైఁచితివొ తండ్రీ! ద్రోహి నైపోతి, హా
అప్పాజీ! యిఁక నా యఘంబునకుఁ బ్రాయశ్చిత్తమే లేదు గా!

అప్పాజీ! నీవు లేని యీ సామ్రాజ్యము నా కేల? ఈ జీవితము నా కేల? ఇదే నీ వెనువెంటనే వచ్చి, నీ పాదములపైఁ బడి క్షమాభిక్ష వేఁడికొనెదఁ గాక!

(కత్తి దూసి) ఓ కృపాణమా!

తే. వైరివీరుల రక్త మింపారఁ గ్రోలి
చాటితివి గాదె యాంధ్రతేజంబు దిశల!

సద్గురుద్రోహి కృష్ణరాట్సార్వభౌము
కంఠరక్తంబుఁ జవి చూచి ఘనతఁ గనుము!

(పొడుచుకొనఁ బోవును)

అన్న— (పట్టుకొని) ఆఁ ఆఁ నాథా! ఇ దెక్కడి ఘోరము! ఇంతవఱ కయిన హత్యలు చాలక యిపు డీ యాత్మహత్య యొకటియా?

కామా— మహారాజా! ఆత్మహత్య మహాపాతకము గదా!

కృష్ణ— ఇట్టి మహాపాతకికిఁ గూడఁ బాతక మంటునా కామానాయకా?

దేవీ! అప్పాజినిఁ బాసి యింక క్షణ మైనను బ్రతుకఁ జాలను. ఈ యనఘుఁడు—

సీ. పిననాఁడె పెదతల్లి విషముఁ బెట్టఁ దలంపఁ
గన్న పుత్త్రునిఁబోలెఁ గాచినాఁడు,
మా యన్న నా కనుల్ దీయింప దొరఁకొన్నఁ
దన యింట డాఁచి నన్ మనిచినాఁడు,
ఆదరంబునఁ దానె యఖిలవిద్యలు నేర్పి
యభిషిక్తుఁ గావించి యలరినాఁడు,
వీరాధివీరులౌ వైరిరాజుల నెల్ల
నాకు దాసులఁగా నొనర్చినాఁడు,

తే. సాదరంబుగ వత్స! వత్సా! యటంచుఁ
బ్రేమరస మొల్క నెపుడు నన్ బిలుచునట్టి
అప్పుఁ డప్పాజితో దివి కరుగలేక
బ్రతికి యే మింక జీవచ్ఛవంబ నగుచు?

అన్న— అటు లైన నన్ను ముందు వధింపుఁడు. నాథా! నే నీ ఘోరవేదన భరింపఁ జాలను.

అమ్మా! ఇదేమి వెఱ్ఱి! మీ రిరువురు ని ట్లయిన నింక నీ సామ్రాజ్యము నెవరి కప్పగింప నెంచితిరి?

కృష్ణ— ఇంకను సామ్రాజ్యమా ?

తే. ఎవని నిరుపమబుద్ధివైభవముకతన
విజయనగరసామ్రాజ్యంబు విస్తరిల్లె
ఆ మహాభాగుఁ డప్పాజి యస్తమింప
అస్తమింపదె యదియు విధ్వస్త మగుచు

మఱియు

తే. పరమపావనుఁ డైన అప్పాజి కింత
ద్రోహ మొనరించినట్టి యీ క్రూరమతికి
అక్కటా! ఒక్క సామ్రాజ్య మనఁగ నేల?
అంతరింపదె నేఁటితో అన్వయంబె?

అన్న } (చెవులు మూసికొని) హరిహరీ! అమంగళము ప్రతిహత మగుఁ గాక!
కామా } అమంగళము ప్రతిహత మగుఁ గాక !!

కృష్ణ— ఈ మహాపాతకికి ఇంక మరణముకన్న వేఱు శరణము లేదు. ఇంక నన్ను వారింపకుఁడు. (పొడుచుకొనఁ బోవును)

అన్న— ఆఁ ఆఁ నాథా! (పట్టుకొని ఆఁపును)

కామా— ఆహా! వీరభద్రగజపతీ! మా కెంతటి ముప్పు దెచ్చిపెట్టితి వయ్యా!

కృష్ణ— (వీరభద్రు నుద్దేశించి, కోపముతో) ఒరోరి వీరభద్రహతకా! నిలు నిలు మెందుఁ బోఁగలవు? ఈ ముప్పున కంతకును గారకుఁడవగు నిన్ను ముందు దెగటార్చి, ఆవలనే నా ప్రాణములఁ ద్యజించెదఁ గాక!

కామానాయకా! తత్క్షణమే సమరసన్నాహము గావింపు మని ఆదెప్ప నాయకునితో నా యాజ్ఞగాఁ దెలుపుము, పొమ్ము.

కామా— చిత్తము. (నిష్క్రమించును)

కృష్ణ— (తిమ్మరుసువైపు చూచి) అప్పాజీ!

మ. కలుషాత్ముండగు వీరభద్రహతకున్ ఖండించి, తద్రక్తధా
రల నీకున్ బితృతర్పణం బొసఁగి, శీఘ్రంబ నేను తండ్రీ! నినున్

గలియన్ వచ్చెద, అంతదాఁకను దివిన్ నాకై ప్రతీక్షింపుమా!
(కొంచె మాఁగి) అయ్యో! ఏమి నా వెఱ్ఱి!
అల నాకంబునఁ గా లిడ న్నగునె కట్టా! యీ గురుద్రోహికిన్?

అన్న— నాథా! ఏటి కి ట్లమంగళవాక్యము లాడెదరు? ఎంత సే పిట్లు వాపోవుట? ఈ మహాత్ముని యాత్మశాంతికై యేదేని యుపాయ మరయుదురు గాక, లెండు.

కృష్ణ— దేవీ! నేను నడువలేకున్నాను. నన్నుఁ దీసికొని పొమ్ము.

అన్న— (లేవఁ దీయును)

కృష్ణ— (లేచి, అన్నపూర్ణతోఁ గూడి తిమ్మరుసు శవమునకు ముమ్మాఱు ప్రదక్షిణము చేయుచుఁ బాట పాడును)

(13) గేయము

(ముమ్మాఱు ప్రదక్షిణము చేసి, తిమ్మరుసు పాదములకు మ్రొక్కి, కన్నుల కద్దుకొని, శవమువంకఁ జూచుచు వెడలిపోవఁ బోయి, పోలేక మఱల వచ్చి, "అప్పాజీ!" అని తిమ్మరుసు శవముపైఁ బడును.)

[తెర పడును]

గద్యము

ఇది శ్రీశారదాప్రసాదాసాదితసరసకవితావైభవ దర్భాన్వయో
ద్భవ సుబ్బాంబాగంగాధరపుత్ర హారితసగోత్ర నాట్యకవితా
కళానిధిబిరుదాంచిత సుధీవిధేయ వేంకటకృష్ణమూర్తి
నామధేయ ప్రణీతంబైన విషాదతిమ్మరుసు
నాటకమున సర్వము సంపూర్ణము.
ఓ మితి శివమ్
శ్రీరామ



# అనుబంధము

## (1) గేయము (పొరట 1)

[" ఆజ్ హిమాలయ కీచోటీసే ఫిర్హంనేలల కారాహై " లోని ట్యూనువలె]

## (2) గేయము (పొరట 1)

[" ఆజ్ హిమాలయ " contd. ]

[" సురూహావాహై జంగతుమారా జాన్ ఉఠోహిం దుస్థానీ " లోని ట్యూనువలె]

## (3) గేయము (పొరట 9)

ధిక్కార మొనరింతువా? బెదర కిటు।
ధిక్కార మొనరింతువా?
అల రాయలే మహా। బలుఁ డంచుఁ దెగువమై
వదరసాగితివె మా। యెదుర నిర్భీతిగా!
ధిక్కార...... మొనరింతువా?
జలధి ఘూర్ణిల్లఁగా। జగము లల్లాడఁగాఁ
జెలరేఁగి మిమ్మెల్లఁ। జీల్చి చెండాడనా?
ధిక్కార...... మొనరింతువా?
ధిక్కార మొనరింతువా। బెదర కిటు
ధిక్కార మొనరింతువా?
ధిక్కార! ధిక్కార!! ధిక్కార!!!

## (4) గేయము (పొరట 12)

[" చల్ చల్ రె నౌజవాన్ " లోని ట్యూనువలె]

రాకుమారుఁడే! రమాకుమారుఁడే!
మూఁడు జగాలేలఁ జాలు మోహనాంగుఁడే!

సమ్మోహనాంగుఁడే! సమ్మోహనాంగుఁడే!!
ఈ కనుతీరూ । అబ్జముఁ గేరూ
చెల్వారు చూపులూ । వాలారు తూపులూ
ఏ తరుణి యీతనికై నోచినదో గా!
అహా! రాకుమారుఁడే......నాంగుఁడే!!
నెమ్మని హారంగూ । క్రొక్కారు మెఱుంగూ!
నెమ్మోము హాసమూ । సమ్మోహనాస్త్రమూ!
ఏ తరుణి యీతనికై నోచినదో గా!
అహా! రాకుమారుఁడే......నాంగుఁడే!!

## (5) గేయము (పాటట 15)

["గగరీసూళి బైల్ పియాసా కాలామేఘా పానీదే" లోని ట్యూనువత]

మదిలో నీ కీ భీతి యేలా । మాటీ మాటీ కీలీలా? మదిలో...।
నేఁడో రేపో రాయలు రాఁడా? । నీదూ వాంఛా తీర్ప లేఁడా?
సరసుఁడో విరసుఁడో సాక్ష్యం బేలా? । సందేహింపక రా బాలా!
మదిలో.........కీలీలా!!

## (6) గేయము (పాటట 27)

["ఆనంద మాయె నహో ఈ వేళా" లోని ట్యూనువత]

నే ధన్య నైతినిగా ఈనాఁడూ। నే ధన్య నైతినిగా!
నే ధన్య నైతినిగా అహో అహో ఈనాఁడూ। నే ధన్య నైతినిగా!!
మనవిని నేలి ప్రియుఁ డిటు నేఁడూ। నను గరుణించెనుగా ఈనాఁడూ
నే ధన్య నైతినిగా!

---

సరా:— ఈ నాటకమునందలి పాటలలోఁ గొన్ని యెడల హ్రస్వాక్షరములు దీర్ఘములుగాను, దీర్ఘాక్షరములు హ్రస్వములుగాను, వ్రాయఁబడినవి. అట్టివి గాయకుల సంగీతసౌకర్యార్థ మని తెలియునది.

ఇహమె యైనా పరమె యైనా । పతియె కాదె సతికి
ప్రాణనాథునీ రాగసుధారసా । వీచికలను దేలీ ఈనాఁడూ
నే ధన్య......నైతినిగా !!

## (7) గేయము (పాట 31)

["మహాకరహీ పులవారీ హామరీ" లోని ట్యూనువలె]

ప్రణయసుధా మయమేగా ప్రకృతీ । ప్రణయసుధా మయమేగా
ప్రణయమేగా జీవితాశా జీవితేశా ! । ప్రణయసుధా మయమేగా
ప్రణయజ్యోతీ వినా మనంబూ । గంధరహితసుమంబూ
ప్రణయంబే సం, జీవనంబూ । ప్రణయమె భవతరణంబూ.
ప్రణయవీచీ డోలికలలో । హంసి నయితీ నాహా !
ప్రణయసుధామయమేగా !
ప్రణయపూజకు నిడియెదగా నా । హృదయసూనము నేఁడూ
పావనమగు నీ ప్రణయకుసుమమే । సదా శిరంబునఁ దాల్తూ
ప్రణయమహిమా తెలియఁ దరమా । ప్రణయమే పరమాత్మ
ప్రణయసుధా మయమేగా !

## (8) గేయము (పాట 44)

["కబుతక నిరాశకీ అంధియారీ" లోని ట్యూనువలె]

మురహరు భజింపరా మూఢజీవా । మురహరు భజింపరా !
ముక్తికి వేఱె కలదా త్రోవా । మోసపడకురా జీవా !
మాయలోఁ బడి కూలిపోకురా । మయికము పోవిడు మోరీ !
ఇంటిదొంగను గెంటఁగ లేవా ? వెంటనే యిఁక జీవా !
కలరూపంబును కానఁ గలవా । కన్ను గెఱవక జీవా !

పదరా! పదరా!! పదరా!!! ప్రమాద మౌరా।
ఇఁకేని మేల్కొను జీవా!
ముక్తికి వేఱే కలదా త్రోవా। మోసపడకురా జీవా!
మురహరం......భజింపరా!

(9) గేయము (పొరట 46)

["ధీరే ధీరే ఆరే బాదలధీరే ధీరేజా" లోని ట్యూనువలె]

మారాకారా రారా, రా సుకుమారా। రారా, రా సుకుమారా
ముద్దీరా!
రారబాబూ బొజ్జనిండా। పాలు వోసెదరా। మారాకారా...॥
రా కుమారా ఆడుకోరా। రార బాబూ రా! రార బాబూ రా!
కన్నతండ్రీ నిన్నుఁ గాంచీ। మిన్ను ముట్టేరా। మిన్ను ముట్టేరా
నిన్నుఁ జూచీ చందమామా। కన్ను గుట్టేరా!
రా కుమారా ఆడుకోరా। రార బాబూ రా। రార బాబూ రా!
నిన్నుఁ జూచీ చందమామా। కన్ను గుట్టేరా! మారాకారా...॥

(10) గేయము (పొరట 48)

["సా పనికి నజారా హై" లోని ట్యూనువలె]

నా తనయ యుదే నేడూ। అహా అహా। నా తనయ యుదే నేడూ
శుభదిన మో రంగా! బళి బళిరా! శుభదిన మో రంగా!
నీ పట్టాభిషేకంబా! నా తనయ యుదే నేడూ
వేడుక మీఱఁగ నేఁడే। చూతును గనులారా
బళి బళి బళిరా। చూతును కనులారా
నీ పట్టాభిషేకంబూ। నా తనయ.....నేడూ

కడు ధన్యునుగా తనయా! కోరిక లీడేఱె। బళి బళిరా కోరిక లీడేఱె।
బ్రహ్మానంద మాయెనుగా! నా తనయు డిదే నేడూ।
బ్రహ్మానంద మాయెనుగా!

## (11) గేయము (పాట 51)

["ప్రీతమే పై జీవనజ్యోతి కిజేసే కోలుమై సరసో" లోని ట్యూనువలె]

హా విధీ! నా జీవనజ్యోతీ। త్రుటిలో రూపుమాపితివా!
హా విధీ...జ్యోతీ!

హా కుమారా! మారసుధాకర। సుకుమారా! గుణధీరా!
దారుణగాథా దురంతబాధా। నే నెటూ భరియింతూ?
హా సుతా! హా సుతా! యింక। నీ నగుమోమును
ఏటూ మఱతురా?
ఆశ నిరాశా, హా పరమేశా। ఏగతీ సైతునో!
ఏగతీ సైతునో!

## (12) గేయము (పాట 65)

మూఢజీవా కానవా। కానవా కలరూపునూ
వినఁ జాలవా హితబోధలా। మనఁ జాలవా కడు హాయిగా
మూఢజీవా...కలరూపునూ॥
క్రిందు మీఁదూ కానలేకా। బొందలోఁ బడ నేలరా?
ఇంటిదొంగను గెంటలేకా। మంటిపాలగు టేలరా?
మూఢజీవా...కలరూపునూ॥
కానివారినిఁ జేరఁ దీసీ। ఘనవారినిఁ ద్రోతువా?

నీ వొనర్చిన కర్మఫలమూ । నిన్ను వెంటాడింపదే?
మూఢజీవా...కలరూపునూ

## (13) గేయము (పొరట 74)

["గుజరగయీా ఒజమానా కైసా కైసా" లోని ట్యూనువలె]

ఎది మఱి నా, కింక త్రోవా?, దేవా, దేవా!
ఎదీ గతీ యింక, నాకు జగతీ।
ఎది మఱి నా కింక త్రోవా? దేవా దేవా!
ఏగతి నైతూ? ఏమి గతియో।
ఇహాపరముల కిటు వెలి యైతే
నిను నెడఁబాసీ నిలువఁ గలనా?
అప్పాజీ! ఆప్తమూర్తీ! దేవా దేవా!
నీ స్నేహమై నితాంతభరమై।
ఏలా మేలా యింక బ్రతుకూ?
శ్రేయోనిధానా! శ్రేయోనిధాన! భరింపఁ దరమా
మది నీ విషాదగాథా? దేవా దేవా!
దయాంబురాశీ! దయాంబురాశీ! నా ద్రోహంబూ
ఏవిధానా నైరింతో!
ముగిసెనుగా నా జీవితగాథా! తండ్రీ తండ్రీ!
నీతోనే యీనాఁ డీలీలా। దేవా దేవా!



ప్రభాత ప్రెస్ - పోస్టు బాక్సు నెం. 25 - మూంగమూరువారి వీధి, నెల్లూరు.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 27 | నా రిరువురు | వా రిరువురు |
| 12 | 23 | నునుజక్కెర | నునుఁజక్కెర |
| 24 | 8 | పాత్రుల్ | సాత్త్రుల్ |
| 24 | 10 | శత్రు | శత్త్రు |
| 30 | 13 | తిమ్మరుము | తిమ్మరుసు |
| 33 | 21 | నే నాంద | నే నానంద |
| 34 | 4 | అప్బాజిచే | అప్పాజిచే |
| 44 | 3 | ఆప్పాజి | అప్పాజి |
| 44 | 16 | ఊఅక | ఊరక |
| 54 | 6 | పుత్త | పుత్త్ర |
| 57 | 14 | తృష్ణ | కృష్ణ |
| 57 | 20 | ట్లూరడింప | ట్లూఅడింప |
| 66 | 15 | అదెప్పనాయకుఁడు | ఆదెప్పనాయకుఁడు |